# పెళ్ళి పాటలు

## స్త్రీల పాటలు మొదటి సంపుటం

సంకలన :

'కళాప్రపూర్ణ'
డాక్టర్. ఎ. అనసూయాదేవి
(వింజమూరి)

ఆంధ్రప్రభుత్వ వైజ్ఞానిక శాఖవారి
ఆర్థిక సహాయంతో ప్రచురించినది

# అంకితం

మాటుపడిన జానపద కళల నెన్నిటినో పునరుద్ధరించి, పోషించిన కళాతపస్విని, నాకు, మా అమ్మను స్ఫురింప జేసే మాతృమూర్తి, శ్రీమతి **కమలాదేవి చట్టోపాధ్యాయ** గారికి, ఈ నా జానపద సంగీత కృషిని, చంద్రునికో నూలుపోగుగా, **అంకితం** చేస్తున్నాను.

అనసూయ

# పరిచయం

కళాప్రపూర్ణ డాక్టర్ అనసూయాదేవితో నా పరిచయం 50 ఏళ్ల నాటిది. అంటే స్వర్ణోత్సవం అయిందన్న మాట.

అనసూయ 10 ఏళ్ల లోపు పిల్లగా ఉన్నప్పుడే, హాస్యరస పితామాహుడు, సంగీతజ్ఞుడూ అయిన కీ. శే. వల్లూరి జగన్నాథరావుగారితో కలిసి, గ్రామఫోన్ రికార్డ్సు ఇవ్వడానికి మద్రాసు వచ్చింది, తన తల్లి తండ్రులతో సహా అప్పుడే, కర్ణాటక సంగీతపు రికార్డ్సు ఇవ్వడానికి, నేను నా తండ్రిగారితో వచ్చాను, 1933 – 34లో అనుకుంటాను. అనసూయ చక్కగా కర్ణాటక సంగీతం పాడడమే కాక, ఎంతో నైపుణ్యంతో తెలుగు జానపద గేయాలు రికార్డ్సు ఇస్తుంటే, విని, నేను చాలా మెచ్చుకున్నాను.

అలాంటి అనసూయ, 50 ఏళ్ల అనుభవంతో, కృషితో, లలిత జానపద సంగీతాల్లో ప్రావీణ్యం సంపాదించి, దానికి తగిన గుర్తింపుగా, ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి చేత, "కళాప్రపూర్ణ" గౌరవం పొందిందంటే, ఆశ్చర్య మేముంది?

50 ఏళ్ల నుంచీ, శాస్త్రీయ సంగీతపు దృఢ పునాదుల పైని తను కంపోజ్ చేసిన లలిత భావ సంగీతంతో పాటు, తనకు అభిమానమైన, జానపద సంగీతాన్ని కూడా, కచేరీలలోనూ, రేడియో, గ్రామఫోన్ రికార్డ్సు ద్వారాను, సినీమాల ద్వారాను, అనసూయ ప్రచారం చేస్తూనే ఉంది.

తాను సంపాదించిన ఈ కళా విజ్ఞానాన్ని గ్రంధరూపంగా ప్రజలకు అందచేస్తుందంటే, ఇది తెలుగు సాహిత్యానికీ, సంగీతానికీ కూడా, అమూల్యమైన సేవ అన్నమాట. ఇంతవరకూ, ఆంధ్రప్రభుత్వము, సంగీత అకాడమీ సహకారంతో, "కృష్ణశాస్త్రి కృతులు" (ఆమె కంపోజ్ చేసిన సంగీతంతో), "జానపదగేయాలు", అన్న రెండు గేయ సంపుటాల్ని కర్ణాటక "నొటేషన్" తో స్వరపరచి, ప్రచురించింది.

ఇప్పుడు తన వద్ద కొల్లలుగా ఉన్న "స్త్రీల పాటలు" స్వరపరచి మూడు సంపుటాలుగా ప్రచురిస్తూ, నాతో గల చిరకాలమైత్రిని పురస్కరించుకుని, నన్ను కొన్ని పరిచయ వాక్యాలు వ్రాయమని కోరింది. నేను అంగీకరించాను. నా దృష్టిలో, భగవంతుడి లాగ, వివిధ రూపాల్లో విరాజిల్లుతూ ఉన్న సంగీతం అంతా, ఒక్కటే, అది ఒక మహాసముద్రం శాస్త్రీయ సంగీతమైనా, లలిత సంగీతమైనా, జానపద సంగీతమైనా — ఆ మహా సముద్రంలో కలిసే నదులే.

"స్త్రీల పాటలు", ప్రజాబాహుళ్యం పాడుకునే జానపద సంగీతానికి శాస్త్రీయ సంగీతానికి మధ్య, వంతెనలాంటివి ఈ పాటలు, ముఖ్యంగా, పట్టణాల్లో సంస్కారం గల స్త్రీలు పాడుకునేవి కనుక, సాహిత్యం బాగుండడమే కాక, వీటి సంగీతం, చాలావరకు రాగ తాళ బద్ధం అయి, శాస్త్రీయ సంగీతానికి చేరువగా ఉంటుంది.

"స్త్రీల పాటలు" — మొదటిభాగం, "పెళ్లి పాటలు" ఇందులో, నిశ్చితార్థం మొదలు, అప్పగింతలూ, మంగళహారతి వరకూ పెళ్లితంతు అంతా పాటల్లో ఉంది. కర్ణాటక సంగీతబాణీలో ఉన్న పాటలు చాలా ఉన్నాయి ఉదాహరణ, పరజు రాగంలో "కొట్నంబుల దంచరే," జంఝూటిలో, "ఏదేశాన్నుం చొచ్చారయ్యా," కాంబోజిలో —"ఎక్కడ దొరకినారే", పుష్ప" లతికలో "పెళ్లికూతురా పెంకితన మేలనే," నవరోజ్‌లో – "ఇతడేనా పెండ్లి కుమారుడూ" కమాచ్‌లో – "వయ్యారి వదినా నీ వలగితివా," నాదనామ క్రియలో –"దండమురా కృష్ణ," పీలులో – "సీతమ్మ మీా అత్త వారింటికేగి," సురటిలో – "ఘల్లుమల్లున పాద గజ్జెలందెలు మ్రోయ."

నేను ఈ గ్రందానికి పరిచయ వాక్యాలు వ్రాస్తూ, ఈ కృషి ఇంకా సాగించాలని, అనసూయని ఆశీర్వదిస్తున్నాను.

**D. K. పట్టమ్మాళ్**

# పరిచయ వాక్యాలు

అనసూయతో నాకు దాదాపు 45 ఏళ్ల పరిచయం. 1942లో, ఆమె ఆకాశవాణి, మద్రాసులో, మ్యూజిక్ కంపోజర్‌గా పని చేస్తున్నప్పుడు, మా సోదరుడు విజయకృష్ణ ద్వారా పరిచయ మయింది అనసూయ రత్నపాపకు తల్లి అయిన రోజుల్లో, మా ఇంటి ప్రక్కన కాపురం ఉండేవారు. అప్పటి నుంచి మేము చాలా సన్నిహితులం అయాం, మా కళాస్నేహం పెరిగింది, మాది పరస్పరాభిమానం.

కవులు, కళాకారులు, కుటుంబంలో పుట్టిన అనసూయకి సంగీతం అభిమాన కళ కావడం సహజం. కర్ణాటక సంగీతంలో, సంగీత సామ్రాట్, కీ. శే. శ్రీమునుగంటి వెంకటరావు పంతులుగారి శిష్యురాలు. శాస్త్రీయ సంగీత జ్ఞానంతో, లలిత, జానపద సంగీతాలను క్రొత్త పంథాలో నిర్మించి, తెలుగు వారి నవ్య సంగీతానికి మార్గదర్శకు రాలయింది, అనసూయ. మ్యూజిక్ కంపోజర్‌గా తాను సంగీతం కూర్చిన నవకవుల గేయాల్ని, పదాలూ, జావళీల పోకడలను స్ఫురింప చేస్తూ, భావపూరితంగా పాడేది. అలాగే ఎన్నో వన్నె వన్నెల జానపదగేయాలను "జానపదగేయాలు ఇంత బాగుంటాయా" అని అనిపించేలాగ అనసూయ పాడుతుండగా విని ఆనందించాను. సంగీతంలో క్రొత్త పంథాని త్రొక్కిన విప్లవకారిణి అనసూయకు నా ఆశీస్సులు ఆనాడే అందించాను.

తరతరాల నుంచి ప్రజాదరణ పొందుతూ విశేష వ్యాప్తిలో ఉన్న స్త్రీల పాటల్ని, సంగీతాభిరుచి కలవారు పాడుకోడానికి వీలుగా స్వరపరచి మూడు సంపుటాలుగా ప్రచురించడం, సంగీత కళకు, సంగీత లోకానికి అనసూయ చేసిన అమూల్య సేవ. అందుకు నేను ఆమెను శ్లాఘిస్తూ, మన సారా ఆశీర్వదిస్తున్నాను. ఈ పురాతన కళా సంస్కృతిని పొందు పరచ వలసిన ఆవశ్యకత ఎంతో ఉంది. ఎన్నో పురాతన రాగాలు జానపద గేయాల్లో పుట్టి, శాస్త్రీయ సంగీతంలో ప్రవేశించాయి. అలాంటి అనాది రాగాల్ని జానపదులు పాడుతుంటే, నుడికారంలోనే స్వరపరచి, పొందుపరచి ప్రచారం చేసిన కీర్తి అనసూయకు దక్కింది. ఈ సేవ నిరాటకంగా సాగడానికి ఆమెకు భగవంతుడు ఆయురారోగ్యాల్ని ప్రసాదించు గాక.

T. ముక్త

# FOREWORD

We consider it a great privilege to write an introduction to third and fourth volumes entitled "PELLI PATALU" and "STHREELA PATALU" by "Kala Prapoorna" Dr Anasuya Devi. We can easily say she is a pioneer in introducing folk music to the public, in concerts. These two books contain many rare old Telugu folk songs. She has been good enough to sing several of them to us and we find most of them are based on traditional Carnatic ragas like Anandabhairavi, Horikambhoji, Nadanamakriya, with full of lyrical content. The songs describe woman as a mother, and responsible citizen, and are usually sung in important festivals, and auspious occasions

Smt. Anasuya Devi who hails from a distinguished family of poets and artistes is a recipient of several prestigious awards of Andhra Pradesh for her vast collection of Telugu folk songs. The publication of these two books will undoubtedly secure for her a permanent place in the realm of folk music. We wish her all success.

(sd.) **RADHA JAYALAKSHMI.**

**Date: 5-10-86**

# ప్రశంసా వాక్యాలు

పల్లెలే మన దేశానికి పట్టుకొమ్మలు పల్లె పడచుల మనోద్వేగాలే మన సంస్కృతికి ప్రతిబింబాలు. అణుయుగంలో పరుగెత్తే మనకి ఈ ప్రతి బింబాలు ఎలా దొరుకుతాయి ? పాశ్చాత్య నాగరికతకై ఉవ్విళ్లూరే ప్రజల మనోప్రవృత్తికి ఈ సహజబావ ప్రకటితాలను ఏవిధంగా దగ్గరగా తీసుకు వెళ్లాలి ? ఈ ప్రశ్నల జవాబే శ్రీమతి అనసూయ దేవిగారి అయిదు దశాబ్దాల కృషి.

పండితులను, పామరులను — పట్నవాసియులను, పల్లెవాసీయులను ఒకేవిధంగా ఆకర్షింప చేసేట్టు జానపద సంగీతాన్ని సేకరించి, పరిశోధించి, సహజ రీతిని పాడి పల్లెవాసియులను సహితం మైమరపింప చేసిన ప్రతిభా శాలి శ్రీమతి అనసూయాదేవి తెరమరుగున వింటె పల్లెవాసియులే పాడు తున్నారా అనే సహజత్వాన్ని సృష్టింప గల్గినావారు ఆమెయే

మంచి కుటుంబంలో జన్మించి, చదువు, సంస్కారము కల్గి, మన సంస్కృతీ సంపదలో ఒక ముఖ్య బాగం అయిన జానపద సంగీతాన్ని ఒక సబ్జక్ట్‌గా తీసికొని దానిలో కళా పరిపూర్ణత చెందిన వ్యక్తి "కళాప్రపూర్ణ" అనసూయాదేవిగారు.

తన అయిదు దశాబ్దాల కృషిని తాను పాడి ప్రచారం చేయడమే కాకుండా, తన అనుభవాన్ని బావితరాల వారికి పంచిపెట్టే సదుద్దేశంతో పెళ్లిపాటలు, ఒక పుస్తకం, మేలుకొలుపులు, లాలి పాటలు, వృత్తి పాటలు, కోలాటం పాటలు, గొబ్బి పాటలు, మరొక పుస్తకం, పండుగ పాటలు, నోములు వ్రతాలు పాటలు, సంవాదాలు, సాంప్రదాయపు పాటలు, మంగళ హారతులు మొదలైన పాటలను మరొక పుస్తక రూపంలో పొందు పరచాలనే వుద్దేశం కడు ప్రశంసనీయం సంగీత జ్ఞానం కల అనసూయగారు క్లిష్టమైన రాగాలలో వున్న జానపద గేయాలను కూడ స్వరసహితంగా పొందుపరచి ముద్రించడం వల్ల ఈ పుస్తకం ప్రజాదరణ పొంది బహుళ ప్రచారం చెందు తుందనడంలో ఎట్టి సందేహం లేదు

జానపద సంగీత ప్రచారానికి ఎనలేని మహోపకారం చేస్తున్న శ్రీమతి అనసూయ అక్కయ్యగార్కి నా ప్రత్యేక అభినందనలు

ఇట్లు

**(కు. శ్రీరంగం గోపాలరత్నం)**

ఆస్థాన విద్వాన్, తిరుమల తిరుపతి దేవస్థానం
ప్రిన్సిపాల్, S.B.R. గవర్నమెంట్ సంగీత, నృత్య, కళాశాల, సికింద్రాబాద్.

హైదరాబాదు,
——— 1986

# 'అ' కారం

అక్షర మాలలోని మొదటి అక్షరం రెండు సార్లు వుపయోగించే, అవసరాల అనసూయతో మా పరిచయం మూడు పదులు దాటి – నాలుగో పదిలోకి వచ్చేసింది. తమిళంలో అచ్చులని ప్రాణమున్న అక్షరాలు 'వుయిర్ ఎళుతుగల్' అంటారు. మా పేర్లు చాలా మటుకు ప్రాణంలేని హల్లుల్తో ప్రారంభమవుతాయి. రెండు 'A' ల అనసూయ, అవసరాల అనసూయ కాక మునుపే భావగీతాలకి తన గాత్రంతో ప్రాణం పోసింది.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు భావకవిత్వానికి ఒక రసప్రపూర్ణమగు వరవడి చుడితే, ఆవరవడికి గాన మాధురి యిచ్చినవారు వింజమూరి సోదరీ మణులు. ముప్ఫై అయిదేళ్ల క్రితం అనసూయ సీతలకి నేటి జయప్రద జయ సుధల కంటే ఎక్కువ మంది అభిమాను లుండేవారు. అయితే అది వాసిలో రాసిలో కాదు.

అసలు భావగీతాలు చదివినపుడు కంటే, పాడినపుడు మధురంగా వుత్తేజకరంగా వుంటాయి అన్నది, 'ఓహో వసంతా – ఓయి వసంతా' అని అనసూయ చిరు బొంగరు గళంతో పాడినపుడు ; నిజంగా వసంతం, మన ముందు విల్చున్నట్లే వుండేది. బసవరాజువారి 'గుత్తి వంకాయ్ కూర', మేనమామ కృష్ణశాస్త్రిగారి 'జయ జయ ప్రియభారత', శ్రీశ్రీ 'ఆనందం అర్ణవ మైతే', నండూరి వారి 'ఎంకి పాటలు', కొనకళ్లవారి 'మొక్కజొన్న తోటలో', వీటిని ఈనాటి సినిమా పాటల కంటే ఎక్కువగా, ఒక కాలంలో హామ్ చేసేవారంటే అందుకు కారణం అనసూయ. భావ గీతాలకి, తద్వారా సినిమా సంగీతానికి బాట వేసిన లలిత సంగీత వైతాళికురాలు.

అనసూయ చక్కగా పాడ గలదు ; సరదాగా ఖబుర్లు చెప్ప గలదు ; శరీరంతో బాటు మనసుని కూడా నిత్య యవ్వనంతో చైతన్య వంతంగా వుంచుకో గలదు. వీటన్నిటితో పాటు మన సంస్కృతిలోని ముఖ్యాంగమైన స్త్రీల పాటలని వెలికి తీసుకొచ్చి, వాటికి సశాస్త్రీయమైన బాణి కట్టి, ముందు తరాల వారికి అందించాలని ఆశ పడుతుంది. ఇది అందరూ ఆమోదించి, ప్రోత్సాహించాల్సిన విషయం స్త్రీలకి వానప్రస్థం లేదు కాబట్టి, అనసూయ బాధ్యత లన్నిటిని పూర్తి చేసి, గానప్రస్థం చేపట్టింది. ఒక రకంగా అనసూయ ప్రయత్నంలో తెలుగు వారికి తమ సాంస్కృతిక సంపదని అందచేస్తున్నది.

ఏజాతి, ఏదేశం తన పూర్వ సంస్కృతిని, నాగరికతని మర్చిపో కూడదు అలా తన పూర్వీకుల నాగరికతను విస్మరించి కొత్త సమాజం ప్రారంభిద్దామను కున్నపుడు, అది పునాదులు లేని భావన మవుతుంది.

అనసూయ, ఈతరం వారికి తమ సంస్కృతి ఏమిటో, వెనుకటి తరాల వారు ఎటువంటి ఆచార వ్యవహారాలు పాటించేవారో, ఈ స్త్రీల పాటల ద్వారా పరిచయం చేస్తున్నది వెనుకటి తరం వారి జీవితాలకి దర్పణం పట్టి, వారి సరసోక్తులని, చలోక్తులనీ చరిత్ర పుటలలో బంధించి, రాబోవు తరాల వారికి అందిస్తున్నది. ఇది కొందరికి అర విహనమైన చాదస్తం పాటలుగా అనిపించవచ్చు. కాని ఈనాడు పంథొమ్మిదవ శతాబ్దపు 'మోడల్ విలేజెస్' అంటూ దేశదేశాలు, తమ తమ ప్రాచీన జీవన విధానాన్ని, అప్పటి విధంగా నిర్మించి, పదాలుకులకు చూపిస్తున్నపుడు, ఈ పాటలు మటుకు ఒకనాటి తెలుగు జీవన విధానానికి ప్రతీకలు కావు — అని ఎవరనగలరు?

ఇరవై ఒకటవ శతాబ్దిలోకి అడుగు పెడుతున్న యీ సమయంలో యిరవయ్యో శతాబ్ది మొదటి భాగంలో 'తెలుగు వారు ఏలా వున్నారు?' పెళ్లి పేరంటాలు వంటి వేడుకలు ఎలా వుండేవి?' అన్న విషయాలు తెలుసుకోటానికి యీ యువతరం, యిప్పుడు కాకపోతే, యింకో పాతికేళ్లకైనా, ఈ పాటలని తమ పరిశోధనకి రిఫర్ చేస్తారన్న నమ్మకం నాకు వుంది.

'మల్లెమొగ్గల రవిక, జాజి మొగ్గల రవికా ఎలా వుంటాయి? కమిటీ కోరి అంటే ఎలా వుంటుంది?' అన్న కుతూహలం నాకే కలిగినపుడు, ముందు తరాల వారికి ఎందుకు కలగదు? తప్పకుండా కలుగుతుంది. అటువంటి కుతూహలం, జిజ్ఞాస పాఠకులలో కలిగించడమే ఉత్తమ గ్రంథ లక్షణం. అనసూయ చాలా శ్రమపడి ఈ పాటలని ఎన్నో రోజులుగా సేకరించి, అపురూపంగా పదిల పరచి ఈనాడు గ్రంథరూపంలోకి తీసు కొచ్చారు. ఇంకా ఈలాంటి పాటలు అయిదారు సంపుటాలు తీసుకొచ్చే ప్రయత్నంలో వున్నారు. మంచిది ఒక పువ్వు వికసిస్తేనే మనకి ఎంతో కనుల పండుగగా వుంటుందే — నూరు పువ్వులు వికసించినపుడు ఎంత మనోహరంగా వుంటుందో!

ఆంధ్ర విశ్వ విద్యాలయం నుంచి కళాప్రపూర్ణ అందుకుని, గృహ లక్ష్మి స్వర్ణకంకణంతో గౌరవింప బడిన, రెండు 'అ' ల అనసూయ ఒక మంచి పని చేస్తోంది, దానిని ప్రోత్సహించి, మేమూ వున్నాము అని సరసన నిల్చునే ప్రయత్నంలో .

మాలతీ చందూర్
6. 12. 86

సంగీతమపి సాహిత్యమ్ !
సరస్వ త్యాస్తన ద్వయమ్
ఏకమాపాత మధురమ్
అన్యదాలోచనా మృతమ్ !

ఆ పాత మధురమైన సంగీతాలాపన ద్వారా శ్రోతల మనస్సులను ఉఱ్ఱూత లూగిస్తూ గానకళా రంగానికి ఎనలేని సేవ చేస్తూన్నారు శ్రీమతి అనసూయాదేవిగారు, అర్ధ శతాబ్దికి పైగా.

నాటి భావకవుల మధుర గీతాలకు లలిత స్వర రచనలను కూర్చి, తమ సోదరి సీతాదేవిని కలుపుకొని పాడి పండిత ప్రశంసల నందుకున్నారు. లలిత సంగీతానికి శాస్త్రీయ సంగీతం ప్రక్క స్థానాన్ని చేకూర్చినట్టి ఖ్యాతి అనసూయాదేవిగారిదే ననవచ్చు. అజ్ఞాత కవుల కలాలనుండి జాలువారి జానపదుల గళాలలో వినవచ్చే మట్టిలోని మాణిక్యాలవంటి గేయాలనెన్ని టినో సేకరించి వాటికంటి యున్న దుమ్మూ ధూళులను దులిపి, చక్కటి మెరుగులను కూర్చి, సభారంజకంగా ఆలపించి, ప్రజలను మైమరపింప చేశారు. జానపదగేయం అనగానే మనకు స్ఫురించేది వింజమూరి సోదరీ మణులు. శాస్త్రీయ, లలిత, జానపద, సంగీతాల త్రివేణి సంగమ రూపులైన అనసూయగారిని ప్రజలూ - ప్రభుత్వమూ, ఉరుబిరుదావళులతోను ఘన సన్మానాలతోను సత్కరించింది. సత్కరిస్తోంది.

పరుసవేది లాంటి వీరి స్వర రచన ఇత్తడి నైనా పుత్తడిని చేయక మానదు. కవివాణి ఎలాగున్నా అనసూయగారు కనుక బాణీని కూరిస్తే వినేవారి గుండెల్లో పది కాలాలపాటు గుబాళిస్తూనే వుంటుందా పాట

ఇప్పటికైనా జాతీయ - అంతర్జాతీయ మన్ననలందినట్టి వీరి గీతాలు గాలిలో కలిసిపోకుండా, అక్షర బద్ధం కావడం ఎంతైనా సంతోషింప దగినది. గాయకులకు మార్గదర్శకంగాను, సంగీతాను రక్తులకు కొంగు బంగారంగానూ, స్వరరచనా బద్ధమైన ఈ గీతాలు మూడు సంపుటాలుగా ప్రచురితమై వెలువడనున్నాయి (1) పెళ్లి పాటలు, (2) స్త్రీల పాటలు, (3) పండుగ పబ్బాల పాటలు - అనే సంపుటాలుగా.

పురాతనమైనవీ, సాంప్రదాయ బద్ధమైనవీ, తెలుగువారి దైనందిన జీవితంలో తటస్థపడే అనేక సంఘటనలు - సన్నివేశాలతో ముడివడి వున్నట్టివీ గీతాలు. అజ్ఞాత వాగ్గేయకారులు తెలుగు తల్లికి అర్పించిన ఈ గీతికా సుమాలకు తగిన స్వర రచన చేసి నేల నాలుగు చెరగులా నినదించేటట్టు రూపొందించారు అనసూయాదేవి గారు.

ఈ పాటలను పరిశీలిస్తే, ప్రజల జీవన విధానంలో ఎంతో ఘని సంబంధం కలగినవిగా స్పష్ట పడుతుంది. గ్రామీణ వాతావరణం పూర్తిగా అదృశ్యంకాని ఊళ్లలో ఇప్పటికి, పండుగ - పబ్బాలలోను, విందులు - వినోదాలలోను, పెళ్లి - పేరంటాలలోనూ, ఈ పాటలు వినబడుతూంటాయి. ముఖ్యంగా స్త్రీలు తమ రోజువారీ కార్యక్రమంలో ఒక భాగంగా వీటిని పాడుకుంటూనే ఉంటారు భగన్నామాలతో విరాజిల్లుతూ భక్తి ప్రపూరితంగా ఆలపించబడే మేలుకొలుపు పాటలు, లాలిపాటలు మొదలైన వెన్నో ! ఇవి భగవదారాధనా కైంకర్య రూపమైనవి.

తరతరాలుగా పెళ్లిపేరంటాలలో పాడేపాటల్లో వియ్యాలవారి వేళాకోళాలు, మంగళహారతి పాటలు మానసికోల్లాసాన్ని కలిగించేవి. ఇలాగ అనేకం నిసర్గ మనోహరమై నేటినాగరిక ప్రపంచంలో క్రమక్రమంగా తెరమరుగై పోతూ, కాలగర్భంలో కలిసిపోతున్న వాటిని సేకరించి, శాస్త్రీయ రాగతాళాలతో స్వరబద్ధ మొనర్చి వాటికి శాశ్వతత్వాన్ని పాదించిన అనసూయదేవిగారి కృషి అనన్య సామాన్యమూ, అభినందనీయం. వారికిదే నా నమోవాక్కులు.

డాక్టర్. నిర్మలాదేవి
హైదరాబాద్

# నాకు తెలిసిన అనసూయ

నా చిన్నతనంలో కృష్ణశాస్త్రిగారి కంటే వింజమూరి సిస్టర్స్‌కే పాప్యులారిటీ ఎక్కువ అనడం అతిశయోక్తి కాదు. సీతా అనసూయ లిద్దరని ఎవరి ప్రతిభా వారిదేనని – మాకూ వయసు పెరిగాక తెలిసిన సత్యం.

కృష్ణశాస్త్రి గారిల్లు – ఒక నిత్య సాహితీసభ. నేను తొలిసారి అనసూయని అక్కడే చూశాను. ఇది ఎప్పటి మాటో. కాని ఈ నాటికీ అనసూయ అలాగే నిగర్విగా, నిత్య నూతనంగా వుండడం గర్వించ తగిన మాట.

జానపద గేయం ఎంత నిత్య నూతనమో, అనసూయ కూడ అంతే. ఆమె కంఠంలో ఆ పదాలు పోయే హొయలు – తెలుగువారి కెవరికీ ప్రత్యేకం చెప్పక్కర లేదు. ఎప్పుడో చేయవలసిన ఈ పనికి అనసూయ యింత లేటుగానైనా పూనుకోవడం ఎంతో సంతోషింప తగ్గ విషయం. ఎందుకంటే జానపద బాణీలే యీనాడు చెలామణీ అవుతున్నాయి గాని సిసలైన జానపద గేయం నెమ్మది నెమ్మదిగా కనుమరుగై పోతోంది. లేదా కలుషితం అయిపోతోంది.

అనసూయ ప్రచురించిన యీ పాటలు యువతరానికి – సిసలైన జానపదా లెంత రమ్యంగా, హృద్యమంగా వుంటాయో చాటి చెప్తాయి. మహిళల మనసున దోబూచులాడే గంభీరమైన భావాలు, సరదాలు – అన్నీ కళ్లకు కట్టినట్టి గేయాలు చెప్తున్నాయి. పాడుకో కోరిన వారి కనువుగా స్వరం జత పరచడం – చాలా గొప్పపని. స్వరాని కొదగని కొన్ని – గమకాలు పాడేవారి ప్రతిభని సవాల్ చేస్తాయి. అవి నేర్చుకున్నవారు అనసూయ వంటి వారి దగ్గిర తగిన శిక్షణ పొందాలి.

ఈ తరగని సాహితీ గనిలో అనసూయ యింకా తవ్వకం పూర్తి చేయలేదు; పని ఆపకుండా – యిలా అన్ని పాటలూ వరుసగా పాఠక లోకానికి అనసూయ అందించాలని నా ఆశ. అంతే కాదు. యువతీ యువకులని శిక్షణకై స్వీకరించి – పాటలు నేర్పే పనికూడా అనసూయ చేపట్టాలని నా కోరిక. ఎందుకంటే అల్లాటప్పా పాటలన్నీ నేడు జానపదాలై కూర్చుంటున్నాయి. అటువంటి అవాంఛిత స్థితి రాకూడదు. జానపద గేయం జనం హృదయానికి ప్రతిక గాని, అసభ్యతకి కానేకాదు. జానపద శిక్షణా కేంద్రం అనసూయ స్థాపిస్తే – మన సాహిత్యానికీ సంగీతానికి ఎంతో సేవ చేసిన వ్యక్తి అవుతుంది. ఆ పని కామెకు హితోధిక ప్రోత్సాహం మన రాష్ట్ర ప్రభుత్వం సాంస్కృతిక శాఖలూ అందించుతారని ఆశిద్దాం.

కె. రామలక్ష్మి

మద్రాసు

# నా మాట - నా పాట

నేను అభ్యసించింది, ఆరాధించేది, నాద స్వరూపమైన శాస్త్రీయ సంగీతం అయితే, నేను ప్రేమించి ప్రచారం చేస్తున్నది, కళాస్వరూపం అయిన లలిత సంగీతం, జానపద సంగీతం అయాయి. ఈ మూడు ప్రవాహాల సమైక్యతే, అనంతం, అగాధం, అపారం అయిన సంగీత త్రివేణి.

మా తాత తండ్రుల స్వగ్రామం పిఠాపురం, నేను పుట్టి పెరిగినది కాకినాడలో, నేను రెండుచోట్లా ఉంటూండేదాన్ని, ఈ నాగరక గ్రామీయ వ్యవస్థల రాపిడి, లలిత జానపద సంగీతాలతో గాఢమైన సాన్నిహిత్యంగా నాలో రూపొందింది.

జమీందారీ స్థలమైనా, పెద్ద, గ్రామంలాగుండే పిఠాపురంలోను, పెద్దరేవు పట్టణం అయినా, గ్రామ వాతావరణం కూడా మిళితమైయున్న కాకినాడలోనూ కూడా, నిత్యమూ నావీనులకు విందుచేసి, నా హృదయ తంత్రుల్ని స్పందింప చేసేవి జానపద గేయాలు. లెక్క లేనన్ని జానపద గేయాల్ని ఆరోజుల్లోనే సేకరించాను. ఆ జానపద గేయాలకి కర్ణాటక లలిత సంగీతాలతోపాటు ఓస్థానం సంపాదించ గలుగు తాననీ, రేడియోలో, సభల్లో పాడగలుగు తాననీ, పుస్తకాలు వ్రాస్తాననీ, అప్పుడు అనుకోలేదు. 'హాబీ' (Hobby) గానే సేకరించాను. ఆ జానపద గేయాల్లో నన్ను ఎక్కువగా ఆకర్షించినవి, శాస్త్రీయ సంగీతానికి సన్నిహితంగా ఉన్న స్త్రీల పాటలు. ఎన్నో రకరకాల స్త్రీల పాటలు పాడగలిగిన, గతించిన మా ముసలమ్మలెందరో నాకు సంగీత జ్ఞానం కలిగినదాకా బ్రతికి ఉండడం, నిజంగా నా అదృష్టం అనుకుంటాను. మా కాకినాడ, ఆరిళ్ల అగ్రహారంలో, విజయలక్ష్మి అత్తయ్య నేర్పిన పాటలు, నా పెత్తల్లి బుల్లెమ్మాయక్కయ్య, పిన్నతల్లి కామేశ్వరి అక్కయ్య ఇచ్చిన పాటలు, మా అమ్మ నేర్పిన కొల్లలు మంగళహారతులు, మా సూరమ్మవదినె, ఆమె అక్కలూ, ఇంకా ఎందరో వయోవృద్ధులు, ఇచ్చిన పాటలు నేర్చుకుని, వాటికి మెరుగులు పెట్టి, నా పద్ధతి (style)లో, పెళ్లిళ్ల లోనూ, అప్పుడప్పుడు సభల్లోనూ పాడడం ఆనాటి రివాజు. ఆ పాటల్ని జ్ఞప్తికి తెచ్చుకుని, రాగ తాళాలతో స్వరపరచి, పుస్తక రూపంగా పొందు పరచడం, ఈనాటి నాధ్యేయం.

కళాత్మకమైన జానపద వాఙ్మయం అంతటిలోనూ, అధికంగా ఆత్మీయత (సెంటిమెంట్) కలిగి, ప్రజా బాహుళ్యానికి హితమై, సన్నిహితమైనవి, సాహిత్య, సంగీత, సంస్కారము గలవి — స్త్రీలపాటలు.

స్త్రీలపాటలు రెండు తెగలు. పల్లెల్లోని జానపద స్త్రీలు పాడుకునేవి పట్టణాల్లోని నాగరక స్త్రీలు పాడుకునేవి. ఈ పాటలు తెలుగునాటి మేటి సంగీత సాహిత్య సంపద. ఆ సంపదలో రత్నాలు పెళ్లి పాటలు. శుభకార్యాలలో శుభాతి శుభమైనది పెళ్లి. అదొక పవిత్ర మాంత్రిక తాంత్రిక కర్మకాండ. పెద్ద పండుగకన్న పెద్ద పండుగ. నూత్న వధూవరుల్ని, పెళ్లివారిని, పెళ్లికివచ్చిన అతిథుల్నీ, అందరినీ అలరించే వినోద కార్యక్రమం పెళ్లి. కాబట్టే, పాటలన్నింటికన్నా, పెళ్లి పాటలతోనే, స్త్రీలకెక్కువ సాన్నిహిత్యం ఏర్పడింది. వాటిని ఉద్రేకంతో, ఉత్సాహంతో, పాడేవారు స్త్రీలే. అవి వాళ్ల సొత్తు. ఇప్పుడు నేను ప్రచురించిన స్త్రీల పాటల్లో మొదటి సంపుటం, ఈ వన్నె వన్నెల పెళ్లి పాటలే.

రెండవ సంపుటంలో, మేలు కొలుపులు, లాలిపాటలు, కోలాటం పాటలు, గొబ్బిపాటలు, వృత్తిపాటలు ఉంటాయి. మూడవ సంపుటంలో, పండుగల పాటలు, నోములు వ్రతాలు పాటలు, సంవాదాలు, సాంప్రదాయపు పాటలు, మంగళహారతుల్లూ, ఉంటాయి. మొదటి సంపుటంలో ఎక్కువ పాటలు ఐహికమైనవి. వృత్తి పాటలు మినహా, రెండు, మూడు, సంపుటాల్లోని పాటలు చాలావరకు ఆధ్యాత్మకమైనవి. ఇవన్నీ ఎక్కువగా నాగరకత గల స్త్రీలు పాడుకునేవే. వివిధ వృత్తులు చేసుకుంటూ బ్రతికే స్త్రీలందరూ గ్రామీయులే. కాబట్టి, రెండవ సంపుటంలోని వృత్తిపాటలు మాత్రం జానపద స్త్రీలు పాడుకునేవి. మూడవ సంపుటంలో పాటలన్నీ ఆధ్యాత్మికమైనవి.

ఈ మూడు సంపుటాల్లోని స్త్రీల పాటల్ని, సాహిత్యదృష్ట్యా, సంగీత దృష్ట్యా, రెండు తరహాలుగా విభజించవచ్చును. అవి, విద్యా సంస్కారము లేని జానపదస్త్రీలు పాడుకునేవి, పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ కూడా కొద్దో గొప్పో విద్యా సంస్కారాలు గల స్త్రీలు పాడుకునేవి. కేవలం జానపద స్త్రీలు పాడే పాటల సంగీత సాహిత్యాలు, మామూలు జానపదగేయాల ధోరణిలో, ఆ బాణీలోనే ఉంటాయి కాని, విద్యా సంస్కారాలు గల నాగరక స్త్రీలు పాడే పాటల సాహిత్యం కాస్త పాటవంగాను, సంగీతం, శాస్త్రీయ సంగీత ఛాయల్లోనూ ఉంటాయి. ఈ రెండు తెగల కధా వస్తువుల్లో కూడా, తేడా కనబడుతుంది. ఉదాహరణగా, జానపదుల పెళ్లి పాటల్లో వాళ్ల సానికాభిరుచులూ, సమస్యలూ దొర్లుతూంటాయి. నాగరక స్త్రీల

పెళ్ళి పాటల్లో పెళ్ళి చూపులు మొదలు, అప్పగింతల వరకూ, జరిగే అన్ని తంతులూ, వినోదాలు, వైవాహిక సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు అన్నీ వ్యక్తం అవుతాయి.

ఈ పాటలన్నీ పాడి ప్రచారం చేసే గాయకురాలిని కాబట్టి, వీటిని నాలాగే ఎందరో పాడుకోవాలని నా అభిలాష. అందుకే, సంగీత జ్ఞానం కలవారు పాడుకోడానికి వీలుగా ఉండాలన్న అభిప్రాయంతో, వీటిని స్వర బద్ధం చేసి, రాగ తాళాలు తెలుపుతూ ప్రచురించాను. వీటిని అన్నమాచార్యులు, రామదాసు కీర్తనల లాగు పాడుకోవచ్చు.

నా కృషిని సహృదయంతో గ్రహించి, ఈ పుస్తకానికి పరిచయ వాక్యాలు వ్రాసిన, కళాసాహిత్య వేత్తలు, సంగీత కళానిధి శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్ గారికి, ప్రశంశ వాక్యాల్ని వ్రాసిన సంగీత విద్వాంసులు శ్రీమతి ముక్త, శ్రీమతులు రాధాజయలక్ష్మి, కుమారి శ్రీరంగం గోపాలరత్నం గార్లకు, సాహిత్య విదుషీమణులు, శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర, శ్రీమతి మాలతీచందూర్, శ్రీమతి డా॥ నిర్మలాదేవి గారికి, నా కృతజ్ఞతాభి వందనాలు.

ఈ పుస్తకానికి ఆకర్షణీయమైన ముఖచిత్రం చిత్రించిన సుప్రసిద్ధ కళాకారుడు బాపు గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఈ ప్రచురణని అన్నివిధాల ప్రోత్సహించిన శ్రీమతి చన్నఘంటమ్మ కృష్ణారావు గారికి, సర్వదా కృతజ్ఞురాలిని. ఈ పుస్తకాన్ని, సకాలంలో, అందంగా, అచ్చువేసి అందించిన, స్త్రీ సేవా మందిర్ ప్రెస్ వారికి నా శుభాకాంక్షలు.

నాకు పబ్లికేషన్ గ్రాంట్ ఇచ్చి ఈ ప్రచురణకి అవకాశం కలిగించిన ఆంధ్ర ప్రభుత్వ వైజ్ఞానిక శాఖవారికి నా ప్రత్యేక, కృతజ్ఞతాపూర్వకాభి వందనాలు.

అనసూయా దేవి

# విషయసూచిక

| పాటలు | | పుటలు |
|---|---|---|

| పాటలు | | పుటలు |
|---|---|---|
|  |

| పాటలు | పుటలు |
|---|---|




# పెళ్లి చూపులు

## అల్ల ఊరి వారు పిల్ల నడిగేరు

### మధ్యమావతి రాగస్వరాలు — ఝంపెతాళం

సా స సా । సా సా స
అ ల్ల ఊ । రీ వా రు
రీ మ మ మ । ప ని ప మ రీ ॥
పి ల్ల న డి । గే - రూ — — ॥

ప్రతీ లైన్ ఇదేవిధంగా పాడుకోవాలి

అల్ల ఊరివారు పిల్ల నడిగేరు
పిల్లవానికి రూపురేఖ లున్నాయి
ఏటేట పండేటి భూము లున్నాయి ॥ అల్ల ॥

ఊరి పొలిమేరలో తోట లున్నాయి
చుట్టు కొల్లారంపు మిద్దె లున్నాయి ॥ అల్ల ॥

కుర్రవానికి మంచి సేద్య మున్నాది
పిల్లదానికి తగిన ఈడుజోడెను ॥ అల్ల ॥

కన్నె నిస్తామని కబురంపుదాము
అల్ల ఊరివారు పిల్ల నడిగేరు
ఇల్లలికి ముగ్గెట్టి పెళ్లి సేతాము ॥ అల్ల ॥

# ఆనంద మానంద మాయెను

## భైరవి స్వరాలు - త్రిశ్రగతి ఆదితాళము

ధా సా, స -  రీ గ స రి । రీ మ గ రీ  సా, సా,
ఆ న ం ద  మా న ం ద । మా — యె నూ మా
సీ త మ్మ  పె ళ్లి కూ తు । రా — యె నూ మా
రా ము డు  పె ళ్లి కొ డు । కా — యె నూ జను
లం దా రి  కా - నం ద । మా — యె నూ — ॥
రీ మ రీ మ -  పా పా, ప । మా పా, మ - గా, రి సా
ప చ్చ - న్ని  ప చ్చ న్ని । పం ది ళ్ల లో - ను
పా పా, ప -  పా ప దా ప । మ మ పా, మ గా, రి నీ స ॥
హె చ్చై న  రాముల వారు వ - చ్చీ కూ ర్చు - న్నారు ॥

### పాట

ఆనంద మానంద మాయెనూ — మా
సీతమ్మ పెళ్లికూతు రాయెనూ — మా
రాముడు పెళ్లికొడు కాయెనూ — జను
లందరి కానంద మాయెనూ ।

॥ ఆనంద మానంద మాయెనూ ॥

చరణం (1) పచ్చన్ని పచ్చన్ని పందిళ్లలోను
హెచ్చైన రాములవారు వచ్చీ కూర్చున్నారు

॥ ఆనంద మానంద మాయెనూ ॥

(2) జీలకఱ్ఱ బెల్లాము సీత శిరసున బెట్టి
సీతమ్మ శిరసున బెట్టి చిరునవ్వు నివ్వనాడు

॥ ఆనంద మానంద మాయెనూ ॥

(3) తోటలంట వెళ్ళినారు మల్లెపూలు తెచ్చినారు
సీతా దోసిళ్ల బెట్టి సిరిదండ లాడినారు
॥ ఆనంద మానంద మాయెనూ ॥

(4) తూరుపంట వెళ్ళినారు తమలపాకులు తెచ్చినారు
సీతారాములవారు సిరిదండ లాడినారు
॥ ఆనంద మానంద మాయెనూ ॥

(5) గుచ్చిన ముత్యాలు తోరణాలు కట్టిరి
గుచ్చని ముత్యాలు తలంబ్రాలు పోసిరి ॥

అనంద మానంద మాయెనూ —— మా
సీతమ్మ పెళ్లికూతు రాయెనూ —— మా
రాముడు పెళ్లికొడు కాయెనూ —— జను
లందరి కానంద మాయెనూ
శాస్త్రావిధులా పెళ్లి; రారమ్మా!
చూడడానికి వెళదాము, రారమ్మా ॥

# శ్రీ సీతారామ కల్యాణం

## శ్రీరాగం స్వరాలు - ఝంపెతాళం

(1) , ప రి రి గ రి రి స స సా ని ని ని ని సా , , ,
మూ - డు దో - , సి - ళ్ల ము త్యా - ల ముం చి —
ని ని స ని స రీ గ రీ రి మ గా రి సా సా , ॥
శ్రీ - రా - ము సీ త పై త లం బ్రా లు ఉం చె ॥

తాళం లేకుండా

స ని స రీ రి రి గ రి స ని ని ని స రి గ రి సా
ల క్ష్మీ క ల్యా - ణా — — వై - భో — గ - మే
ప స స ని స రీ రి రి గ రి స , ని స ని స రి గ రి సా
రా - మ - క ల్యా - ణా — వై భో - గ - మే ॥

పాట

లక్ష్మీ కల్యాణ వైభోగమే
రామ కల్యాణ వైభోగమే ॥

(1) మూడు దోసిళ్ల ముత్యాలు ముంచి
శ్రీరాము సీతపై తలంబ్రాలు ఉంచె
॥ లక్ష్మీ కల్యాణ ॥

(2) మాలలు మార్చిరి మహిపతులు చూడ
బాల లందరు గూడి బాల పాటలు పాడ
॥ లక్ష్మీ కల్యాణ ॥

(3) కొంగు ముళ్లను వేసి గొబ్బున వసిష్ఠుండు
పొంగు వియ్యంబు పోషింప జేసెనూ
॥ లక్ష్మీ కల్యాణ ॥

(4) మేలైన పలదానం తాంబూలముతో నపుడు
మేలుగ పొగడిరి భూపాలు రపుడు

॥ లక్ష్మీ కల్యాణ ॥

(5) అరివేణి లోణకంగ హరియు సీతమ్మయు
మరి బాగు చుట్టిరి పెండ్లి పందిటను

॥ లక్ష్మీ కల్యాణ ॥

(6) తలుపు మూసీ పేర్లు తగ నడిగి రపుడు
తలవంచి సీతమ్మ శ్రీరాము డనెను

॥ లక్ష్మీ కల్యాణ ॥

(7) మగువకు తగినటు పురుషుడు బలికె
తగునని భూపతులు తలలూపి రపుడు

॥ లక్ష్మీ కల్యాణ ॥

(8) ఇద్దరిని కూర్చిన సృష్టికర్త నపుడు
బుద్ధిమంతుడని పొగడి రందరునూ

॥ లక్ష్మీ కల్యాణ ॥

(9) మంగళహారతులు మరి యెత్తగానూ
పొంగుచు వనితలు ఆనందముతోను

॥ లక్ష్మీ కల్యాణ ॥

# కొట్నాలు దంచే పాట

## ఫరజురాగము - త్రిశ్రగతి ఆదితాళము

| | | | |
|---|---|---|---|
| పల్లవి | సా మ గ మా | - | పా ప ద మా |
| | కొ ట్న ం బు ' | | లా ద ం చ |
| | పా , , , , | - | , , , — , , , ॥ |
| | రే —— | | —— —— ॥ |
| | ప ద సా స ని | - | ద ద పా ప మ |
| | కో - రి క - | | లొ స గే - టి |
| | గా మా ప మ | - | గ మ గ రి స ని ॥ |
| | గో పా లు - | | ని — — ఎ దు ట ॥ |
| చరణం (1) | ; ద పా ద | - | ; ని నీ స |
| | ; సు ర లు | | ; ము ను లు |
| | సా సా, స | - | ని ద నీ, స |
| | చు ట్టా లు | | గు మి గూ - డి |
| | ; స స సా స ని | - | ప ద పా ప మ |
| | ; క రు ణా గో | - | రు చు పా - డ |
| | గా , మ మా ప మ | - | గ మా గ రి స నీ ॥ |
| | గా మ న సు - | | దీ —— రా —— ॥ |

## పాట

కొట్నంబులా దంచరే
కోరిక లొసగేటి గోపాలుని ఎదుట

॥ కొట్నంబులా దంచరే ॥

**చరణం** (1) సురలు మునులు చుట్టాలు గుమిగూడి
కరుణా గోరుచు పాడగా మనసుదీరా

॥ కొట్నంబులా దంచరే ॥

(2) పరమ పావనుడైన
బాల గోపాలుడు
వర రుక్మిణి తోడ
సరస మాడుచునుండ

॥ కొట్నంబులా దంచరే ॥

(3) కాంతలు సురటీలు
గైకొని విసరగా
ఎంతో సంతోషమున
కాంతు జనకుడుండ

॥ కొట్నంబులా దంచరే ॥

(4) ధరను తిరుమల సూరి
తలచగ వరమిడు
నరహరి పెండ్లిపు
డరమర లేలనే?

॥ కొట్నంబులా దంచరే ॥

# పసుపు నలిచే పాట

## జంఝూటి స్వరాలు - త్రిశ్రగతి ఆదితాళము

స స సా , స - రీ సా , ని । దా , , , , - రీ రీ రీ గ రి
న లు గు కు రా వే మి । రా — రా ధా కృ ష్ణ
సా సా , స - సారి సా ని । దా , , , , - రీ రీ రీ గ రి
సుం దా రి కోరి వ చ్చె । రా — రా ధా కృ ష్ణ
**చరణం** (1) సా గా, గ - గామ గామ । రీ మ గా రి - సా స సా స
జా జా లు పైన చ ల్లి । రో - జా లు చే తి కి చ్చి
స స స సాస - రీ సా , ని । దా , , , , - రీ రీ రీ గ రి
సి గ కుపూలు చు ట్టే ను । రా — రా ధా కృ ష్ణ

### పాట

నలుగుకు రావేమిరా రాధాకృష్ణ
సుందరి కోరి వచ్చెరా రాధాకృష్ణ

॥నలుగుకు॥

**చరణం** (1) జాజాలు పైనచల్లి రోజాలు చేతికిచ్చి
సిగకు పూలు చుట్టేనురా రాధాకృష్ణ

॥నలుగుకు॥

(2) గంధము నీ చేతితా గైకొన వేమిరా ?
సుందరి కోరివచ్చెరా రాధాకృష్ణ

॥నలుగుకు॥

(3) పునుగు జవ్వాజి పూసెద రారా!
పూబంతు లాడేమురా రాధాకృష్ణ

॥నలుగుకు॥

# నలుగు పాట

## వనజాక్షి వేగ రావే

### పూరీ కళ్యాణీ - మిశ్రచాపు

| | | | | |
|---|---|---|---|---|
| పల్లవి | ,గ ద పా ప మ | - | గా మ | గ రి సా |
| | వ న జా క్షి - | | వే గ | రా - వే |
| | స స స సా రి స నీ | - | స స రి | గ గ గా |
| | వ ని త రో —— | | న లు గు | కి పు డు |
| చరణం (1) | పా , ద ప ప స | - | స స స | సా సా |
| | లా వా - - ణి | | చీ - ర | గ ట్టి |
| | సా రి గ సా స ని | - | ద ద ద | స స సా |
| | రం —— గై నా - | | ర వి క | తొ డి గి |
| | ప సా - సా స ని | - | ద ద ని | ద ద పా |
| | లా - వ ణ్య - | | ము గ - | నీ - వు |
| | ప ప ని ద పా ప మ | - | గ మ రి | గ గ మా |
| | ర మ ణి - రో —— | | న లు గు | కి పు డు ॥ |

పాట

పల్లవి వనజాక్షి వేగ రావే
వనితరో నలుగు కిపుడు

॥ వనజాక్షి ॥

చరణం (1) లావాణి చీర గట్టి
రంగైన రవిక తొడిగి
లావణ్యముగ నీవు
రమణిరో నలుగు కిపుడు

॥ వనజాక్షి ॥

(2) కమ్మని కస్తూరి నొసట
తిలకములే దిద్ది
హెచ్చయిన జాజి విరులు
కొప్పున తురిమి వేగ

॥ వనజాక్షి ॥

(3) గజ్జ లందియలును
ఘల్లు ఘల్లున మ్రోయగను
వయ్యారి నడపులతో
వెలదిరో నలుగు కిపుడు

॥ వనజాక్షి ॥

(4) వాసిగ మన వూరి
చంద్రుడు లేచినాడమ్మ
కామినీ మణి వేగ
పీటకు లేచి రావమ్మ

॥ వనజాక్షి ॥

# నలుగు పాట

## నలుగుకు రావయ్య

### శహన రాగం - మిశ్రచాపు తాళం

**పల్లవి** ; స స రి గా రి - రీ , రీ రీ
న లు గు - కు రా వ య్య
రి గా మ పా మ – గా , రి మ గ రి సా
నా – దా - వి నో దా —— ——
; రి ద ప ద స ని ద ప - పా , ప ప ప మ
వే గా ———————— మే రా – వ య్య
; మా ప ద ద ప మా – గా మరి రిగరిమ గ రి సా
వే ణా —— గో పా —- లా —— ——

**చరణం (1)** ; ప ప పా మా — ద ద ని సా సా
సూ రీ గ • న్నె ర – పూ లు
; ద రి స స సా – స ని దా, దసనిద పా
సూ స క ము క —— ట్టిం —— చి
; ద రి స స స ద - ప దాసని ద ప పా ప రి
సుం ద రు డ – నా —— చే —— త——
; రి గ మ ప దా ని ద – పాదపమ గ రిమగరిసా
సూ– స – క —— మం – దు - కో ———

## పాట

పల్లవి
నలుగుకు రావయ్య
నాదా వినోదా
వేగామె రావయ్య
వేణూ గోపాలా ॥ నలుగుకు ॥

చరణం (1)
సూరి గన్నెర పూలు
సూసకము కట్టించి
సుందరుడ నాచేత
సూసక మందుకో ॥ నలుగుకు ॥

(2)
సన్న మల్లెలు దెచ్చి
సరము కట్టించి
సరసూడ నాచేత
సరమంద వయ్యా ॥ నలుగుకు ॥

(3)
చెండు పూవులు దెచ్చి
చెండు గుట్టించి
చెందురుడ నాచేత
చెండంద వయ్యా ॥ నలుగుకు ॥

(4)
సిరి చందనపు చెక్క
గంధము తీయించి
కాముాడ నాచేత
గంధము అందుకో

(5)
జాజికాయ జాపత్రి
మడుపె చుట్టించి
మన్మధుడ నాచేత
మడుపంద వయ్యా ॥ నలుగుకు ॥

# నలుగుకు రావయ్య

## ఆనందభైరవి - మిశ్రచాపు

| | | |
|---|---|---|
| పల్లవి | , గ మ - పా పా | । పా , - ని ప ప మ |
| | న లు గు కు | । రా వ - య్య - |
| | , గ మ - పాదప మాపమ | । గా రి - సా , , |
| | న ం దా— కు — | । మా - రా — |
| | , సా - మ గ రీ | । గ మా - పా పా |
| | వే గా - మె | । రా - వ య్య |
| | గ గా - మా మా ప మ | । గా రి - సా , , ॥ |
| | వే - ణు గో — | । పా లా — ॥ |
| చరణం (1) | , గ మ - పా పా | । పా , - ని ప ప మ |
| | న లు గు కు | । రా వ - మ్మ |
| | , గ మ - పాదప మాపమ | । గా రి - సా , , |
| | న వ మో - హ — | । నా ం గీ — |
| | , స స - మ గ రీ | । గ మా - పా పా |
| | వె ల దీ - ఓ | । రు - క్మి ణి |
| | గ గా - మా మాపమ | । గా రి — సా , , ॥ |
| | వే - గా రా — | । వ - మ్మా — ॥ |
| | , ప ని - పా ప మ | । ప నీ — సా సా |
| | చ ద రం కి — | । మై - మీ ద |
| | ని సా - రీ గ రి | । స నీ — సా సా |
| | కూ - ర్చుండే - | రు - క్మి ణి |

| | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| , ప | ప | - | సా | సా | | | । | స | రి | స | - | ని | ద | ప | ప | | |
| మా | | | మీ | ద | | | । | ద | య | - | | వు | ం | చి | - | | |
| గ | మా | - | పాదప | మాపమ | | | । | గ | రీ | | - | గ | మ | ప | ప | ॥ | |
| లే | - | | చీ - | — | — | | । | రా | — | | | వ | - | మ్మ | - | ॥ | |

పాట

**పల్లవి** నలుగుకు రావయ్యా నందకుమార
వేగమె రావయ్యా వేణుగోపాల ॥

॥ నలుగుకు ॥

**చరణం** (1) నలుగుకు రావమ్మ నవమోహనాంగి
వెలది ఓ రుక్మిణి వేగరావమ్మా !
చదరంకి మైమీద కూర్చుండే రుక్మిణి
మా మీద దయవుంచి లేచి రావమ్మ ॥

॥ నలుగుకు ॥

(2) సన్నజాజులు తెచ్చి సరములు కట్టి
సరము లందుకోవయ్యా యశోదబాలా
మంచిది దవనము, పచ్చటి పసుపు,
పునుగు, జవ్వాజి, పన్నీరు, నలుగు పెట్టెద

॥ నలుగుకు ॥

# నలుగు పెట్టరె వదినకు

## హరికాంభోజి స్వరాలు త్రిశ్రం

గ గ గ - గ మ గ - రి స స - సా ,
న లు గు పె ట్ట రె వ ది న కూ
ధ̣ స స - స స రి - గ మ̇ గ - రి స రి
నా - తి సుం ద రి బొ - మ్మ కూ —
పా ప - పా ప - ప ప ద ప - ప గా
దు ం ప కొ మ్ము ప సు పు - తో —
రీ రి - గా , - గ మ ద ప - మ గా ॥
దూ ల కొం డా - కు - తో — ॥

### పాట

(1) నలుగు పెట్టరె వదినకూ
నాతి సుందరి బొమ్మకూ
దుంపకొమ్ము పసుపుతో
దూల కొండాకుతో

॥ నలుగు పెట్టరె ॥

(2) మంచినూనె మడ్డితో
మరిగేటి తారుతో
సీమ సింతాకుతో
సీమ మిరపకాయతో

॥ నలుగు పెట్టరె ॥

(3) మల్లెలమ్మ మల్లెలు
మంచి సంపెంగలు
రమ్మనవె నలుగుకు
నాతి సుందరి బొమ్మనూ

॥ నలుగు పెట్టరె ॥

# బంతు లాడగ రావే

## పూరీకల్యాణి – మిశ్రచాపు

| | | | |
|---|---|---|---|
| | ప ప ద పా ప మ | । గ గ మ | గ రి రి స |
| | బ ం తు లా డ గ | । రా — | వే — |
| | సా , ; ; | । సా , | స రి గ గ |
| | —— —— | । పా - | ర్వ - తి - |
| (1) | ప ప ద పా ప మ | । గ గ మ | గ రి రి స |
| | బ ం తు లా డ గ | । రా - వె | పా - ర్వ తి |
| | చె ం త నొ ం ది - | । యుం టి | కో - మ లి ॥ |
| | పా ప ద ద పా | । సా , | సా సా |
| | ప ం త — ము | । మా | నీ నా |
| | స రి గ రి స స ని | । ద ని ద నీ , | ద ప పా |
| | చె ం — తా — ను - | । చే —— | ర - వే |
| | ప ని ద పా ప మ | । గ ప రి | గా మా ॥ |
| | ఇ ం - తి పూ - | । లా — | బ ం తి ॥ |

### పాట

బంతు లాడగ రావె, పార్వతి
చెంత నొంది యుంటి కోమలి
పంతము మాని, నాచెంత చేరవె
ఇంతి పూల బంతి !

॥ బంతులాడ ॥

(2) రాజముఖి బంతి రాజాడు,
తేజ మలరిన విరుల బేసరి నేడు
కుంజరయాన నీ చెంగటకు వచ్చె,
భామినీ హంస గామినీ !

॥ బంతులాడ ॥

(3) కర్పూర గంధిరో ! వేగమే
కాంతల మర్చిన చెండు
చూడుమీ ! నేర్పుతో వేసెద బంతిని
బట్టి ; మీ రవ్వ ఏలా?

॥ బంతులాడ ॥

(4) చెండు నందుకోవె భామినీ
బొడ్డు మల్లెపూల
చెండు వచ్చేను ఇదిగో
నారీ సుకుమారీ !

॥ బంతులాడ ॥

# బంతులాట పాటలు

## బంతు లాడ రావే బాలికా మణిరో

### కాంభోజిరాగం - ఆదితాళం

, , , ప ద సా ని ద
బ ం తు లా డ —

సా , దా , మా - ప ద పా గా మా
రా వే బా లీ — కా మ

పా , పా , ॥
ణీ రో ॥

, , , పా దా , సా రీ
ఇ ం తి రు క్మి

గా , గా, గ రి - మ గా సా, స ,
ణి తో బె ం తా — చే రి

ని ద ప మ - మా ॥
పూ — లా ॥

పాట

(1) బంతు లాడ రావె బాలికా మణిరో!
ఇంతి రుక్మిణితో బెంత చేరి - పూల

॥బంతు॥

(2) వనజాక్షు నాతో వాదు లేల పోర
వనిత సీతతో నీ వోడినా వదేలా

॥బంతు॥

3) పంత్త మేల పోరా పార్వతీశ్వరుడా
వెంకట వరదుడ బింక మేల పోరా

॥బంతు॥

# బంతుల నాడ రారా

## పీలురాగస్వరాలు — ఆది తాళం

| | | | |
|---|---|---|---|
| సా స స | ని$^{1}$ ద$^{2}$ ప ద | సా , , | సా , , |
| బం తు ల | నా డ | రా — | రా — |
| ద ని రి$^{2}$ రి$^{2}$ | రి$^{2}$ గ$^{1}$ మా$^{1}$ | గా రీ | రి గ రి గ |
| భా సు రా | కా రా | ధీ రా | ——— |
| సా గ$^{2}$ గ | గ$^{2}$ మ పా ద ప | మ గ మా | , , , , |
| కాం త తో | ప ం తా — | మే - లా | ——— |
| స స రి రి | రి గ మా | గా రీ | రి గ రి గ ॥ |
| క ని క ర | ముం బా | వే రా | ——— ॥ |

### పాట

(1) బంతు లాడ రారా
భాసురాకారా ధీరా
కాంతతో పంతామేలా ?
కనికర ముంబా వేలా ?

॥ బంతులాడరారా ॥

(2) చెలియలు ఇందు చేరి
చెంతను చేర కోరి
పలుమరు నిన్ను వేడ
బిరబిర రారా శౌరి

॥ బంతులాడరారా ॥

(3) అఖిల జగద్రక్షా
అచ్యుత రాజీవాక్షా
నిఖిల నిత్య రక్షా
రాజిత జన పక్షా

॥ బంతులాడరారా ॥

# పూల బంతు లాడెనే

### దేశ్ — త్రిశం

| | | | |
|---|---|---|---|
| రీ మ | ప ని ని | ని స ని | సా , |
| పూ ల | బ ం తు | లా డె | నే |
| ని స రి | ని ని ద | ప ద ప | మ గ రి |
| బా ల | రు క్మి ణి | కృ ష్ణు | లు - |
| గ ప | మా , గ | రి మ గ | రి స స |
| మే | లై న | బ ం గా | ర పు - |
| రీ మ | ప ని ద | పా , | పా , ॥ |
| మే డ | లో ప ల | నే | డు ॥ |

### పాట

(1) పూలబంతు లాడెనే
బాల రుక్మిణి కృష్ణులు
మేలైన బంగారపు
మేడ లోపల నేడు

॥ పూలబంతు లాడెనే ॥

(2) బాల సంతసముగా
నీలవేణు లెల్ల చూడ
భేరీ మృదంగములు
భోరున మ్రోయగ

॥ పూలబంతు లాడెనే ॥

(3) వర కామిను లెల్ల
వచ్చి నాట్యములు సేయ
విరజాజులు మల్లెలు
సరసిజ సుమములు

॥ పూలబంతు లాడెనే ॥

# పూలబంతుల నాడుటకు

**జంఝూటి — ఆదితాళం**

| | | | |
|---|---|---|---|
| , గా గ | గా గ రి సా | , స రి స | ని ధ ని ప |
| పూ ల | బం తు ల | నా - డు | ట కు నీ - |
| , పా ప | ద స స రి | పా , మ | ప మ గ రి సా ॥ |
| జా ల | మెం దుల | కే చె | లి య రో — ॥ |
| , సా స - | గా గా | , గ మ ప | మ గ మా |
| బా లు | లే వే | స ర సి | జా - క్షి |
| , గా రి | స స పా | , మ ప మ | గ రి స స ॥ |
| బా లు | ఇ క నీ | బి గు వు | న గ ర టె ॥ |

## పాట

(1) పూల బంతుల నాడుటకు నీ
జాల మెందులకే చెలియరో
బాలు లేవే సరసిజాక్షి
బాలు ఇక నీ బిగువు నగరటె

॥పూలబంతుల ॥

(2) మోమోరగ వచ్చి మగవారిని గాంచి
చిరునగవు తెప్పించి మారాడ వేల ?
విరస మేల వినుతశీల
విన్న నెవరైనా నగరటే

॥పూలబంతుల॥

(3) ఇంతి చామంతి పూబంతిగనవే
పంతమా, మంతమా, చెంత తగునా
ఇందువదనా కుందరదనా
సందియం బేలే నగరటే

॥ పూలబంతుల ॥

# పూల వసంతము

## కమాచ్ రాగం — ఆదితాళం

; మ పా మ గా మా మా పా పా

పూ ల వ సం — త ము

; ద సా స సా - ప స ని ద పా పా ॥ ప ద

లా — డె నే ద — మ — యంతి ॥

; ప సా సా స - సా ; నీ సా

రా — జా ధి రా జ శ్రీ

; ప పా ద సా - ద ని స ద - ద మ

న లా మ హా రా ——— జు - తో —— ॥

### పాట

(1) పూలవసంతము
లాడెనె దమయంతి
రాజాధి రాజశ్రీ
నల మహారాజుతో

॥ పూల వసంతము ॥

(2) గులాబి పువ్వుల్ల చీరా
గులాబి మొగ్గల్లా రవికా
గులాబి పువ్వుల దండా
ఘుమా ఘుమా పరిమళింపా

॥ పూల వసంతము ॥

(3) చామంతి పూలచీర
చామంతి మొగ్గల రవికా
చామంతి పూలాదండ
చెలియతో నాడేనే

॥ పూల వసంతము ॥

(4) సంపంగి పూలర
సంపంగి పూల రవికా
సంపంగి పూలదండా
సకియాతో నాడేనే

॥ పూలవసంతము ॥

(5) చుట్టు జల్తారు చీర
మల్లెమొగ్గల రవికా
సంపంగి దండాలు
ఘుమా ఘుమా పరిమళింప

॥ పూలవసంతము ॥

(6) ముత్యాల పానుపుపై
ముదముతో కూర్చుండి
వజ్రాల వాహిని
మెరయుచు నిద్దరూ

॥ పూలవసంతము ॥

(7) పూర్ణచంద్రుని వంటి
ముఖకమలము నందు
కలువ రేకుల వంటి
కన్నులతో చూచుచు

॥ పూలవసంతము

# వేణు గోపాలునికి

## కాపిరాగం — త్రిశం

| | | |
|---|---|---|
| స ప పా , ప | - | పా ప పా ద |
| వే - ణూ గో. | | పా లు ని కి |
| మ పమ దా ప | - | గా రి స ని స |
| వె ద కీ - ప | | న్నీ రు చ ల్ల రే |
| స సగ గ గా | | గ గ మ గ మా |
| స ర స మా డే | | రు క్మి ణి కి |
| గ మ పా ద ప | | మ గ మా మ మా మ |
| స్వా - మీ — | | శ్రీ — కృ ష్ణ ని కి |

॥ వెదకీ ॥

### పాట

(1) వేణుగోపాలునికి
వెదకీ పన్నీరు చల్లరే
సరస మాడే రుక్మిణికి
స్వామీ శ్రీకృష్ణునికి
వెదకీ పన్నీరు చల్లరే ॥

(2) ముత్యాల పీట వెయ్యరె
ముత్తైదు లందరు మీరు
వెదకీ పన్నీరు చలరే ॥

(3) సంపంగి నూనె లంటరె
సకియా లందరు మీరు
వెదకీ పన్నీరు చల్లరే ॥

(4) పన్నీటి జలక మార్చరే
భామ లందరు మీరు
॥ వెదకీ పన్నీరు చల్లరే ॥

(5) బంగారు శాల్వ తీయరే
పణతు లందరు మీరు
॥ వెదకీ పన్నీరు చల్లరే ॥

(6) మల్లెపూల హార మేయరే
మగువ లందరు మీరు
॥ వెదకీ పన్నీరు చల్లరే ॥

(7) కర్పూర హార తీయరే
కాంత లందరు మీరు
॥ వెదకీ పన్నీరు చల్లరే

వేణుగోపాలునికి
వెదకీ పన్నీరు చల్లరే
సరస మాడే రుక్మిణికి
స్వామి శ్రీకృష్ణునికి
॥ వెదకి పన్నీరు చల్లరే ॥

# బాల రావే

## శంకరాభరణం — మిశ్రచాపు

| | |
|---|---|
| రీ గ రి గ మా | । గా రి సా ని స |
| బా ల రా - వే . | । పో ల యీ భూ - |
| రీ రి రీ రి గ | । మా ప ప మ మ గ |
| పా ల మౌ ళి ని | । చూ డు మా భూ |
| సా స స స స ని | । దా ని పా ప - |
| పా ల మౌ - ళి ని | । చూ డు మా - యీ |
| రీ రి రీ గ గ | । మా ప ప మ మ గ ॥ |
| పూల హా ర ము | । వే యు మా ——— ॥ |

### పాట

(1) బాల రావే పోలయీ - భూ
పాల మౌళిని చూడుమా - భూ
పాల మౌళిని చూడుమా ఈ
పూలహారము వేయుమా

॥ బాలరావే ॥

(2) అతడు కాడే ఇతడు కాడ
ల్లాతడమో చూడుమా
అంచయానరో ఆత్మ విభుని
ఎంచి హారము లేయుమా

॥ బాలరావే ॥

# బువ్వంబంతి పాటలు

## చూడనెంతో శృంగారము

### ఖరహరప్రియ స్వరాలు — ఆదితాళం

; సా రి గ రి । సా ధ ని ప ధా ని

చూ డ నె ం తో శృం గా ర

సా ; ; ప ప । ధా సా రీ ప మ

మూ — సు ద తీ రో సీ తా

గ రి ని సా రి గ రి । సా ధ ని ప దా ని

——— రా మ చ ం ద్రు ల బు వ్వ

సా , - ; ; । , ; - ; ; ॥

మూ — — — ———

**చరణం (1)** , ; దా సా రి । రి ప మ ప మా మ మ మా

హెా చ్చైన అ రి టా —— కు లే

, ; గ గ గ మ గ రి । స రి స రి గా మ గ రి స సా

తె చ్చి వే సి నా —— —— ర ట

, , సా రి గ రి । సా ద ని ప దా ని

చె ప్ప శ క్య ము గా ద

సా ; ; ప ప । ధా సా రి రి ప మ

టే — చె లి యా రో వి న వే —

గ రి ని ॥

— — — ॥

## పాట

చూడ నెంతో శృంగారము
సుదతీరో సీతా రామ చంద్రుల బువ్వము ॥

॥ చూడనెంతో ॥

చరణం (1) హెచ్చైన అరిటాకులె
తెచ్చి వేసినారట
చెప్ప శక్యము గాదటె
చెలియరో వినవే

॥ చూడనెంతో ॥

(2) సన్నబియ్య పన్నమట
వన్నె మీర సూపమట
ఎన్నో ఎన్నో కూరలట
కన్నెరో వినవే

॥ చూడనెంతో ॥

(3) వడలంటె వడలట
కడలేని హెూళీలట
నడుమ నడుమన మండియల్
మందయాన వినవే

॥ చూడనెంతో ॥

# బువ్వంబంతి పాటలు

## రామచంద్రుల బువ్వము రమణీయము

"చూడనెంతో శృంగారము" — వలె

ఖరహరప్రియ స్వరాలు ఆదితాళం

పల్లవి   రామచంద్రుల బువ్వము
రమణీయము — శ్రీ

(పల్లవిలాగే)

భూమిజతో గూడి
భుజియింప ముదమౌ

॥ రామచంద్రుల ॥

చరణం (1) వంకాయ కూరలు, వడియ మప్పడములు
తీరైన కంది పప్పు, సోకొప్పగా
॥ రామచంద్రుల ॥

(2) బర్ఫీ జిలేబులు, బహు మంచి పూరీలు,
కర్పూరమంటి నెయ్యి, కనుగొనగా
॥ రామచంద్రుల ॥

(3) వేడి క్షీరాన్నముల్, వేగమే వెలదులు,
వెండి గిన్నెల నొంచిరి, కడవోద్యమౌ
॥ రామచంద్రుల ॥

(4) వరమౌ సాదము, చక్కని చారును,
సరగున వడ్డించిరి, సౌఖ్యము మీర
॥ రామచంద్రుల ॥

(5) ధరలో తిరుమల దాసుడు మొరవిడ
వరమొసంగి నట్టి పరమాత్ముడైన
॥ రామచంద్రుల

# బువ్వంబంతి పాటలు

## విందు చేసినారు వియ్యాలవారింట

### కాంభోజిరాగం — ఆదితాళం

| | | | | | |
|---|---|---|---|---|---|
| పల్లవి | ; | ॥ ప ద సా | సా ని ద | పా ద ద | దా మా |
| | విం | ॥ దు - చే | - సీ - | నా — | రూ వి |
| | పా | , ప మ గా | మా | పా ; పా | ప మ |
| | య్యా | లా — | వా | రిం | టా ప - |
| చరణం (1) | ప ద సా సా ని ద | పా , | దా , మా | | |
| | ప్పే - ఉ డ క - | లే | దు బా | | |
| | ప ద పా ప మ గా | మా | పా , | పా , ప ప | |
| | రే - - మ ర గా | — | లే | దూ అ ర | |
| | దా , | సా , రీ - గా , గా , | మ గ | | |
| | టీ | కా య - పో | పు | అ స | |
| | రీ , స సా , స - ద స నీ | ద మ ప మ | ప ప ॥ | | |
| | లే — వ ం-డ | లే — | దూ —— | వి ం ॥ | |

పాట

చరణం (1) విందు చెసినారు వియ్యాల వారింట
విందు మాట చెపితే వింతగా ఉంటుంది
పప్పే ఉడకలేదు, చారే మరగలేదు,
అరటికాయ పోపు, అసలే వండలేదు ॥ విందు ॥

(2) బూరులైతొండారు, బుట్టలతొ పెట్టేరు,
బద్దకాము చేత, బంతే సాగించారు ॥ విందు ॥

(3) గొప్పకి వారిళ్లా, అప్పడా లొత్తేరు,
ఇప్పు డెందుకనీ, బంతే సాగించారు ॥ విందు ॥

(4) నేతి చెంబులు పట్టి, మాటి మూతేశారు
చెయ్యే తడవాలేదు, చెప్పకుంటే సిగ్గు ॥ విందు ॥

# వియ్యాలవారింట్లో విందు చేసినారు

"విందు చేసినారు" వలె

**కాంభోజిరాగం — ఆదితాళం**

(1) వియ్యాల వారింట్లో విందు చేసిరంట
దండిగా ప్రాణాలు మెండుగానే లేవు

॥ వియ్యాలవారింట్లో ॥

(2) వటి కందిపప్పు, వడ్డించి వెళ్లేరు
ములక్కాయ ఇగురు, ముడిబియ్యపన్నాము

॥ వియ్యాలవారింట్లో ॥

(3) పచ్చి తామరాకు బంతూలు వేశారు
వడిగా వారు వడ్డించి వెళ్లారు

॥ వియ్యాలవారింట్లో ॥

(4) పుచ్చిపోయిన చెక్క, వాడిపోయిన ఆకు,
పొట్లిపోయిన సున్నం, ఇచ్చిపోయారు

॥ వియ్యాలవారింట్లో ॥

(5) బావగారి జుట్టుకు బంతి పూలు చుట్టేరు
వీధి వీధుల తిప్పి, వింతగా చూశేరు

॥ వియ్యాలవారింట్లో ॥

# విందు చేసినారు వియ్యాల వారింట్లో

"విందు చేసినారు" — వలె

**కాంభోజిరాగం — ఆదితాళం**

(1) విందు చేసినారు
వియ్యాల వారింట్లో

॥ విందుచేసినారు ॥

విందు మాట చెపితె
వింతగా ఉంటుంది

॥ విందుచేసినారు ॥

(2) పొట్టి బావగారు
కొట్టు పెత్తన మంట
కొట్టులో సరకులు
ఇవతలకు రానీరు

॥ విందుచేసినారు ॥

(3) అత్తగారు వచ్చి
పళ్ళెం తట్టినది
మామగారు వచ్చి
మట మట లాడేరు

॥ విందుచేసివారు ॥

(4) పెద్ద బావగారు
మేళం వద్ద నుండె
వదిన గార్లంతాను
నట్టింట బోయేరు

॥ విందుచేసినారు ॥

# చేడెరో బువ్వము బంతి

## శంకరాభరణ స్వరాలు -- మిశ్రచాపు తాళం

పా ప ప మ ద ప ।

చే డె రో - బు -

మా మ మ గ గ రి

వ్వా ము బ ం తి -

సా స రీ గ రి ।

చూ డ వే డు క

సా ని సా ; ॥

లా యె నే ॥

### హరికాంభోజి స్వరాలు

సా స స స ని స ।

నే డు ద శ ర థ

రి మ మ మ ప ప ద

రా - ము న కు మ న

నీ ద ద ప మ గ ।

సీ త ని - వ్వ గ ।

గ రి స స రి గ మ

వి ం టి మీ ——— ॥



5

## పాట

(1) చేడెరో బువ్వాము బంతి
చూడ వేడుక లాయెనే
నేడు దశరథ రామునకు మన
సీత నివ్వగ వింటిమో

॥ చేడెరో ॥

(2) విల్లు విరచిన నాడు చెలి
ఎల్ల స్థిరమను కొంటిమి।
పల్లవాధరి నిటుల గూర్చిన
బ్రహ్మ లీలను కొంటిమో

॥ చేడెరో ॥

(3) ఈడు జోడుగ నున్నవాడు
నేడు జనకజ గూడుతన్
వాడ వాడా చేడె లందరు
కూడి చిత్రము చూడగన్

॥ చేడెరో ॥

(4) రామ లక్ష్మణ భరత శత్రు
ఘ్నులా పెండ్లిని కంటిమో
రామరో మిధిలాపురమున
రమ్యమును కనుగొంటిమో

॥ చేడెరో ॥

# ఏలాగు భోంచేతుము

## సురటరాగం — త్రిశ్రగతి ఆదితాళం

పల్లవి

| | | | | |
|---|---|---|---|---|
| రి మ ప | స ని ద | ప ద ప | మ మ గ | |
| ఏ - లా | - గు - | భో ం - | చే - తు | |
| రీ , | రీ , | రి మ గ | రి స స | |
| మూ | ఈ | వి ం దు | మే——— | ॥ మేలాగు ॥ |

అనుపల్లవి

| | | | | |
|---|---|---|---|---|
| రీ మ | రీ మ | ప ని సా , రి | | |
| చా లా | - పె | ళ్లి - ళ్లా | యె | |
| సా , | నీ ద | ప ద ప | మ గ రి | |
| ఈ | లా టి | వి ం దు | మే——— | ॥ మేలాగు ॥ |

చరణం

| | | | | |
|---|---|---|---|---|
| మ మా , | మా | మా ప ని ద ప | మా మా , గ | |
| వి స్త | ళ్ల | వే ——— | శా —— | |
| రీ , | రీ , | రి మ గ | రి స స | |
| రూ | —— | బా - | రి· డే - సి | |
| రీ మ | రీ మ | పా స | నీ ద | |
| వె డ | - ల్పు | లే - | వ ం | |
| పా , | , , , | , , , | , , , | |
| డీ | —— | —— | —— | |
| రీ మ | రీ మ | ప నీ | సా రి | |
| హ స్తం | - బు | క దు పు | టా కు | |
| సా నీ | , ద | పా ద ప | మా గ | |
| శా రా | ర | చో టు - | లే దు | ॥ ఏలాగు ॥ |

పాట

పల్లవి
ఏలాగు భోంచేతుము
ఈ విందు, మే — । ॥ మేలాగు ॥

అనుపల్లవి
చాలా పెళ్లిళ్లాయె
ఈ లాటి విందు మే — ॥ మేలాగు ॥

చరణం (1)
విస్తళ్లు వేశారు, వారిడేసి ,
వెడల్పు లేవండీ
హస్తంబు కదుపుటాకు
జౌరార చోటులేదు ॥ ఏలాగు ॥

(2)
కూరే వంకాయ కూర, దానిలోకి
మార్చే పచ్చడి లేదు,
కలహంబులతో
కారంబులు గుచ్చెత్తిరి ॥ ఏలాగు ॥

(3)
ముక్కబియ్యము వండిరి, దానిలోకి
ముద్ద పప్పే వేసిరి,
చెప్పకుంటె సిగ్గొతుంది,
చెయ్యి కడిగిన జిడ్డు లేదు ॥ ఏలాగు ॥

(4)
లడ్డూ జిలేబీలా పాకములో
మడ్డీ తేలిందంటూ,
వడ్డించె వదినగారి
వడ్డాణము ఊడిపోయె ॥ ఏలాగు ॥

# తలుపుల దగ్గర పాటలు

## కృష్ణుడు - భామ సంవాదం

**మాయామాళవగౌళ — మిశ్రచాపు**

; ; స స । సా , । సా ; - స రి మా ; । మా ; । మా ;
ద ం డా ము రా — కృ ష్ణా

; , గ మ । పాదా । దపమా - గామ పామ । గామగ । రిససా
ద ం డా మూ - రా ——— నీ — కు—

; ; స రి । గా ; । మా , । - గామాగా । రీ సా । సరినీ
ద ం డా మూ పె — ట్టే - ద—

; ; సా । సా ; । రీ , ప - మపమమాగ । రీ సా । సరినీ ॥
దా రీ డ - రా —— కృ - ష్ణా —

; సా । గామగ । గరిరీ - రీ స సా , । ; ; । ; ; ॥
దా రీ — డ — రా — — —॥

### పాట

భామ
దండమురా కృష్ణా
దండమురా నీకు
దండము పెట్టెద
దారిడరా కృష్ణా
దారిడరా !

కృష్ణ
దండ మంటే బహు
గండమె ఓ చెలి
దండము పెట్టిన
దారిడనే, భామా
దారిడనే !

భామ	నగధరా నీసరి
మగవారితో వాదు
తగదెల్పవే పసి
దానను రా, కృష్ణా
పసిదాననురా !

కృష్ణ	పసిదానవా నీవు,
పైె మాట లాడేవు,
పసిదాని కేల యీ
పౌరుషమూ, భామా
పౌరుషమూ !

భామ	పౌరుష మాడేటి
పణతు లచ్చట నుండ,
వారిజాక్ష ! నాతో
వాదేలరా ? కృష్ణా
వాదేలరా ?

కృష్ణ	వాదించి నేను, ఈ
వసుధలో దుష్టుల
ఛేదించినానే, ఓ
చెలి వినవే, ఓ
చెలి వినవే !

భామ	శేషశయన శ్రీ
రావూరి పురవాస
ఆరడి సేయుట
మేలటరా కృష్ణా,
మేలటరా ?

# తలుపు తీయవె తరుణిరో

కాంభోజి — త్రిశం

ప ద స - స స స - స రి గా స - సా ని ద పా
త లు పు తీ య వే త రు ణీ రొ రా ధా —

ప ద దా ప - మ గ రి గా , - పా ద ద ప ద - సా ,
క లి కీ - చి - - న్ని కృ ష్ణ - ని - కీ

పా ద ద స రి - గ గ గా గా - గా మ గ రీ గ రి సా ని ద పా
కా ళి ం గ - మ ర్ద న ము గా వి ం చీ - - వే గా —

గా ప ద ద రి - సా , — , , , ॥
ఇ ం దు వ చ్చి తి నీ — — — — ॥

## పాట

(1) తలుపు తీయవే తరుణిరో, రాధా,
కలికి, చిన్ని కృష్ణునికి !
కాళింగ మర్దనము గావించి వేగ
ఇందు వచ్చితినీ !

॥ తలుపు ॥

(2) నందకుమార నవనీత చోరా
పొందుగనే పోపోరా !
సుందరి రుక్మిణి నెందుకు ఎడబాసి
ఏల వచ్చితివీ ?

॥ తలుపు ॥

(3) వట పత్ర శయనా, వారిజ నేత్రా,
ఎచ్చటికైనా పోపోరా !
పదహారు వేల గోపిక స్త్రీలను
కూడిన వాడవురా !

॥ తలుపు ॥

# భామాకృష్ణుల సంవాదము

## తల్లి యశోదా తనయుడ నేను

### హరికాంభోజి స్వరాలు — ఆదితాళం

**కృష్ణ** ; సా సా నీ సా ; గా ; । గా రీ గా మా - గా రీ రీ సా
తల్లి యశో దా తనయుడ నే - - ను
సా సా రీ సా రీ సా స ని నీ । సా సా రీ రీ - గామగ రిసపా ॥
తలుపు తీ - యవే — భా —— మా ——నాకు
; స స రీ సా రీ సా స ని నీ । సా సా రీ నీ సా ; ; ; ॥
తలుపు తీ - యవే — భా —— మా ——॥

**భామ** , స దా దా పాదా పామామా । గామా పా మా గామగ రి స సా
తలుపు తీ - యమని కులు కుచు ప లి - కె - వు
సాసా రీ సారీ సా స ని నీ । సాసా రీ రీ - మా మ గ రి సా
తలుపు రా - దు పో— । వో —— యీ — కృష్ణ
; స స రీ సారీ పా స ని నీ । సాసా రీ సా - సా ; ; ; ॥
తలుపు రా - దు పో— వో——— యీ——॥

పాట

**కృష్ణ** తల్లి యశోదా తనయుడ నేను,
తలుపు తీయవే భామా, నాకు
తలుపు తీయవే భామా !

**భామ** తలుపు తీయమని కులుకుచు బలికెవు,
తలుపురాదు పోవోయీ, కృష్ణా,
తలుపురాదు పోవోయీ !

కృష్ణ		ముచ్చు సోమకుని పిచ్చణగించిన
		మత్స్యమూర్తినే భామా నేను
		మత్స్యమూర్తినే భామా !

భామ		మత్స్యమ వైతె మడుగులో నుండక
		ఇచ్చట పని యేమోయీ కృష్ణ
		ఇచ్చట పని యేమోయీ ?

కృష్ణ		కూర్మంబై నేను కుదరము మోసిన
		కూర్మమూర్తినే భామా, నేను
		కూర్మమూర్తినే భామా !

భామ		కూర్మంబైతే బురదలో నుండక
		ఊరికే పని యేమోయీ, కృష్ణ
		ఊరికే పని యేమోయీ ?

కృష్ణ		గర్వితుడగు హిరణ్యకశిపు ద్రుంచిన
		నరహరినే ఓభామా, నే
		నరహరినే ఓభామా !

భామ		గర్వముతో నీవు నరహరి ననెదవు
		కారడవికి పోవోయీ, కృష్ణ
		కారడవికి పోవోయీ !

భామ		పల్లవాధరుల ఇండ్లు తిరిగి ఇటు
		మెల్లగ వస్తివోయీ, కృష్ణ
		మెల్లగ వస్తివోయీ?

కృష్ణ		ఎవ్వరి ఇంటికి పోవగ లేదు
		రవ్వ బెట్టకే భామా, నను
		రవ్వబెట్టకే భామా !

భామ		అగడ మేమిర జాగును సేయక
		బాగుగ దెల్పవోయీ, కృష్ణ
		బాగుగ దెల్పవోయీ !

కృష్ణ		దండము పెట్టేద అండకు చేర్పవె,
		దగ్గర నీయవె భామా, నాకు
		దగ్గర నీయవె భామా !

# విష్ణుమూర్తి లక్ష్మీదేవుల సంవాదము

("తల్లియశోదా తనయుడ నేను" వలె)

విష్ణు కలికి కవాటము బంధన చేసిన
కారణ మేమే లక్ష్మీ? నీకు
కారణ మేమే లక్ష్మీ?

లక్ష్మి కారణ మేమని అడిగెదవు
నీ మది తెలియగ లేదటవోయి, స్వామి
నీ మది తెలియగ లేదటవోయీ?

విష్ణు తెలియక చెంతను నే చేరితిని
వంత మేలనే లక్ష్మీ నీకు
వంత మేలనే లక్ష్మీ?

లక్ష్మి పరమాత్మ నీకు వంతము లేటికి
వదర వద్దు పోవోయీ స్వామి
వదర వద్దు పోవోయీ!

విష్ణు చెంచిత యని మది చింత జేసెదవు
చింత యేలనే లక్ష్మీ నీకు
చింత యేలనే లక్ష్మీ?

లక్ష్మి కొంచెపు జాతి చెంచిత నాకు
సవితి యనుచు చింతేరా నాకు
సవితి యనుచు చింతేరా!

విష్ణు కలికి కవాటము తెరవి నప్పుడె
కంఠహార మిచ్చేనే నేను
కంఠహార మిచ్చేనే!

లక్ష్మి కంఠహారము చెంచిత కిచ్చి ఆ
చెంచిత గూడుము స్వామి ఆ
చెంచిత గూడుము స్వామి!

విష్ణు	జిలుగు బుటేదార్ చీరలు తెచ్చితి
చేకొన వేమే లక్ష్మి నన్ను
చేకొన వేమే లక్ష్మి?

లక్ష్మి	జిలుగు బుటేదార్ చీరలు తెచ్చితె
చెంచిత కిడి రావోయీ, స్వామి
చెంచిత కిడి రావోయీ!

విష్ణు	మల్లెపూవుల దండలు తెచ్చితి
మగువరో గైకొన వేమే లక్ష్మి
మగువరో గైకొన వేమే?

లక్ష్మి	మల్లెపూవ్వల దండలు తెచ్చితె
మగువ కిచ్చి రావోయీ, స్వామి
మగువ కిచ్చి రావోయీ!

విష్ణు	ఇప్పపువ్వుల దండలు తెచ్చితి
ఇకనైనా గైకొన వేమే లక్ష్మి
ఇకనైనా గైకొన వేమే?

లక్ష్మి	ఇప్పపువ్వులు తెచ్చితె చెంచిత
కిచ్చి కీర్తి గనవోయీ స్వామి
ఇచ్చి కీర్తి గనవోయీ!

విష్ణు	కరి మేషంబున గండభేరుని
తరిమి గాసితినె పడతీ లక్ష్మి
తరిమి గాసితినె పడతీ!

లక్ష్మి	గాసి దీర్చుటకు చెంచిత దోడ్కొని
గరుడాద్రికి పోవోయీ స్వామి
గరుడాద్రికి పోవోయీ!

విష్ణు	దండిగ తప్పులు బాల జేసితి
దండ మైన చేకొనవే లక్ష్మి
దండ మైన చేకొనవే!

లక్ష్మి పెండ్లి కుమారుడై నందుకు నా
దీవెన లివిగో స్వామీ, నా
దీవెన లివిగో స్వామీ !

విష్ణు శరణు శరణు శ్రీలక్ష్మి శరణు
శరణు ఇందిర శరణు లక్ష్మి
శరణు ఇందిర శరణా !

లక్ష్మి నవ్వుచును శ్రీవిష్ణు వాకిలి తీసెద
గట్టిగాను రావోయి స్వామి
గట్టిగాను రావోయి !

మదన జనకుడు మగువ దోడ్కొని
మందిర మునకూ నేగె !

# కృష్ణ భామల సంవాదము

## "తల్లి యశోదా తనయుడ నేను" — వలె

### హరికాంభోజి స్వరాలు — ఆదితాళం

కృష్ణ బాలామణిరో తలుపు తియ్యవె
బాల కృష్ణుడను భామా నే
బాల కృష్ణుడను భామా !

భామ బాలుడ వైతె పదియారు వేల
భార్యలు నీకేమోయీ కృష్ణ
అబద్దా లాడకు మోయీ !

కృష్ణ చీరలు రవికెలు చిత్రపటంబులు
కోరి తెచ్చినా భామా నా
కోర్కె తీర్చు గుణధామా !

భామ చీరలు గలిగితె చెలియ వలువలు
చేకొని పోదు వటోయీ, ఓ
చిలిపి దొంగ పోవోయీ !

కృష్ణ చీరలు దాచితె సిగ్గు కలునని
చేకొని యిచ్చితి భామా నే
చిలిపి దొంగను కానే !

భామ చీరలు రవికెలు చిత్రపటంబులు
చేడెల కివ్వగదోయీ వారి
చెంత జేరు పోవోయీ !

కృష్ణ పట్టు పరుపులు బాలీసులను
కట్న మిచ్చెదనె భామా నను
కరుణ చూడు గుణధామా !

భామ పాము నిపై పవళించెడి వారికి
పరుపు ఎక్కడిదోయీ కృష్ణ
బాలీసు లెక్కడినోయీ ?

కృష్ణ భక్తవత్సలుడ గనుకను పాము
పానుపాయెనే భామా నే
పవళించితిని గుణధామా !

భామ పట్టె మంచము పరుపులు నీవా
పణతుల కివ్వగ బోవోయీ అందు
పవ్వళించు పోవోయీ !

కృష్ణ అక్షయముగ గజ అశ్వము లిచ్చెద
ఆరడి బెట్టకు భామా, న
న్నాదరించు గుణధామా !

భామ అక్షయముగ గజ అశ్వము లుంటే
పక్షి నెక్కుటేమోయీ నీ
పరువు దెలసె పోవోయీ !

కృష్ణ పరమ భక్తుడా గరుడాళ్వారు
పక్షి నెక్కితి భామా నే
పాలించితి గుణధామా !

భామ అక్షయముగ గజ అశ్వములన్నీ
అతివల కియ్యగదోయీ నీ
వటు తిరిగి పోవోయీ !

కృష్ణ భామరో మూడు పంటలు పండెడి
భూము లిచ్చెదను వినవే, పొలతిరో
తలుపు తీయవే భామ !

భామ భూములు కలిగితె, బలిని మూడడుగులు
దాన మడుగు టేమోయీ, కృష్ణ
దర్పము లాడేవు సుమోయీ !

కృష్ణ దనుజుని ద్రొక్కుట కొరకై నేను
దాన మడిగితిని భామా, వాని
ధన్యుని చేసితి భామా !

భామ భూము లేలుటకు పురుషులు కాము
భూములు మాకేమోయీా, నీ
పుణ్యము ఇక పోవోయీా!

కృష్ణ భువనము లిచ్చెద భామరో యిపుడు
పొందుగ తలుపు తీయవే, భోగ
వతి నను రానీయావే

భామ భువనము లుంటే పాలకడలిపై
పవ్వళింతు వటవోయీా నీవు
పవ్వళింతు వటవోయీా ?

కృష్ణ భువనములను బుట్టించుట కొరకై
పాలకడలి కేగితిని నే
పవ్వళించి యుంటినే!

భామ భువనము లేదని పగలు రేయి నే
పోరుపెడితి నటనోయీా నీ
పొందుచాలు పోవోయీా!

కృష్ణ శ్రీమంతుడనే ధనవంతుడనే
శ్రీవెంకటేశపతి నేనేను, నీకు
సిరిసంపద లొసగెదనే!

భామ దొడ్డ కులంబున దొరలై నప్పుడు
వడ్డికాసు లేమోయీా కృష్ణ
వర్తక మదియేమోయీా ?

కృష్ణ వసుధలో మనుజులు వచ్చుట కొరకై
వడ్డికాసుల నడిగితినే నే
వరము లిచ్చి వారి బ్రోచెదనే!

భామ చీకటి వేళను సిరు లిచ్చెద వని
చిన్నెలు యెరుగుదువోయీా ఓ
వన్నెకాడ పోవోయీా!

కృష          గొప్పదొరను, నీవు కోరిన కోరిక
కొనసాగించెద భామా ఇక
కోప ముంచకే లేమా !

భామ          విప్రుని ధోవతి కొంగున అటుకులు
విప్పి తినుట యేమోయీ నీ
గొప్పతనము యేడోయీ ?

కృష్ణ          అతనికి సంపద లొసగుటకై నే
అటుకులు తింటినె భామా నే
అభయ మిచ్చితి లేమా !

భామ          గొప్పతనము ఆ కోమలి రుక్మిణి
కొప్పచెప్పగ వోయీ ఆమె
కోర్కె తీర్చు పోవోయీ !

కృష్ణ          ఏమి నేరములు చేసితినో నా
కిపుడె తెల్పవె భామా నీ
కిచ్చెద సుంకము లేమా

భామ          ఇంత ప్రొద్దుపోయి ఇటు వచ్చుటకు
ఏమి కారణ మోయి ? నా
కిపుడె దెల్పగదోయీ !

కృష్ణ          రామదాసులను పోషించుచు, రా
మరచితి వినవె భామా నను
రవ్వ సేయకే లేమా !

భామ          దాస పోషకుడ వైతె యామె
దగ్గర నుండగదోయీ కృష్ణ
తగిన వరం బివ్వవోయీ !

కృష్ణ          భావము నిల్వదు భామరో, నేనీ
పాదములకు మ్రొక్కుదునే నీకు
బద్ధుడనై యుండెదనే !

# భామా కృష్ణుల సంవాదం

## ఏమే భామా వాకిలి తీయవు?

**హరికాంభోజి స్వరాలు — ఆదితాళం**

; సా స ని । సా గా । గ రి గ మ । గ రి రి స ।
ఏ మే - । భా మా । వా - కి లి । తీ - యవు ।
స ని రి స । రి స ని ని । స స రి రి । గామగ రి స ।
ఇ ం టి లో । - ప లి కి । వ - చ్చె ద । నే — భామ ।
ని స రి స । రి స ని ని । స స రి స । సా ; ॥
ఇ ం టి లో । - ప లి కి । వ - చ్చె ద । నే — ।
, , , , । , , , , । , , , , । , , , , ॥
స ద దా దా । ప ద ప మ । గ మ ప మ । గామగ రి స ।
నీ — మొగ । మె రు గ ను । చీ - క టి । లో — న - ।
ని స రి స । రి స ని ని । స స రి రి । గామగ రి స ।
ఎ ం దు కు । వ - చ్చె ద । వో — । యీ — నీ - ।
ని స రి స । రి స సా । స స రి స । సా ; ॥
వె వ ర వొ । చె - ప్ప । వో —— । యీ — ॥

### పాట

**కృష్ణ** ఏమే భామా వాకిలి తీయవు
ఇంటి లోపలికి వచ్చెదనే భామ
ఇంటి లోపలికి వచ్చెదనే!

**భామ** నీ మొగ మెరుగను చీకటి లోన
ఎందుకు వచ్చెదవోయీ నీ
వెవరవొ చెప్పవోయీ !

కృష్ణ	సరగున వేదంబులు భువి తెచ్చిన
జలచర పతినే భామా నే
జలచర పతినే భామా !

భామ	జలచర పతివైతె కృష్ణ
జలధి కడకు పోవోయీ కృష్ణ
జలధి కడకు పోవోయీ !

కృష్ణ	మంధరగిరి నా మూపున నిల్పిన
కూర్మ రూపినే భామా నే
కూర్మ రూపినే భామా !

భామ	కూర్మ రూపుడవు నీవైతే కృష్ణ !
కొండ కడకె పోవోయి కృష్ణ
కొండ కడకె పోవోయి !

కృష్ణ	కావర మందిన రావణు ఢృంచిన
రాముడనే గుణధామా నే
రాముడనే గుణధామా !

భామ	శ్రీరాముడ వైతే మేలాయెను
సీత కడకు పోవోయి కృష్ణ
సీత కడకు పోవోయీ !

కృష్ణ	పాపడనై నే గోవుల గాచిన
గోపాలుడనే కొమ్మా నే
గోపాలుడనే కొమ్మా !

భామ	గోపాలుడ వైతే మేలాయెను
గొల్ల మందలకు పోవోయీ కృష్ణ
గొల్ల మందలకు పోవోయీ !

కృష్ణ	చిటపట చినుకులు దుప్పటి తడిసెను
తలుపు తీయవె భామా
చలమేలనే సత్యభామా !

కృష్ణ	ఒప్పుల కుప్పవు వనితరో మనకు
తప్పు లేమిటికి బామా నను
దయ నేలవే గుణధామా !

భామ	కిలకిల నవ్వుచు సత్యభామ
తా కిర్రున తలుపు తీసె
శ్రీకృష్ణుని కలిసి మెలసె !

# వెంకటేశ్వరస్వామి, అలమేల్ మంగ,
# సంవాదము

"తల్లి యశోదా తనయుడ నేను" వలె

వెంకట శ్రీకాంతామణి నేనీ సఖుడను
శ్రీఘ్రము వాకిలి తీవే నీవు
శీఘ్రము వాకిలి తీవే !

అలమేల్ ఓ కాంతుడ నీ గుణములు తెలిసెను
ఊరకె వెళ్లగదోయీ నీవు
ఊరకె వెళ్లగదోయీ !

వెంకట ఈ మాటలు నీ వెన్న డాడ వది
ఏమే అలమేల్ మంగా అది
ఏమే అలమేల్ మంగా ?

అలమేల్ భామల మరగిన వాడవు, నాతో
పలుకులేల పోవోయీ ఈ
పలుకు లేల పోవోయీ !

వెంకట పర భామల నే కూడితినని యిటు,
పలుకుట కారణ మేమే సఖి
పలుకుట కారణ మేమే ?

అలమేల్ తరుణుల గూడక యుంటే పువ్వుల
దండలు ఎక్కడివోయీ పువ్వుల
దండలు ఎక్కడివోయీ ?

వెంకట పూల దండలు హరి హరి నే నెరుగ
భక్తులు అర్పించిరె ఓ చెలియా నా
కర్పించిరె ఓ చెలియా !

అలమేల్ సరసిజాక్ష నీ అధరము నొక్కిన
సారసాక్షి ఎవరోయీ ఆ
సారసాక్షి ఎవరోయీ ?

వెంకట　　తరుణిరో అదియొక పలమని చిలుకలు
తగిలి పొడిచెనే భామా అది
తగిలి పొడిచెనే భామా !

అలమేల్　　వరదుడ నీ చెక్కులకును ఈనెల
వంక లున్నవేమోయీ నెల
వంక లున్నవేమోయీ ?

వెంకట　　గోరువంకల పట్టుకు రాగా
కొరికెను ముద్దుల గుమ్మా అవి
కొరికెను ముద్దుల గుమ్మా !

అలమేల్　　సారసాక్ష నీ మేనున తెల్లని
చందన మెక్కడిదోయీ ఈ
చందన మెక్కడి దోయీ ?

వెంకట　　పూలతోటలో విహరించగ ఈ
పుప్పొడి రాలెనె తరుణీ ఈ
పుప్పొడి రాలెనే తరుణీ !

అలమేల్　　పూలతోటలో విహరించుటకును
పోయిన కారణ మేమి నీవు
పోయిన కారణమేమి ?

వెంకట　　పావురంబు తప్పించుక పోగా
పట్ట బోతినే చెలియా నే
పట్ట బోతినే చెలియా !

అలమేల్　　దేవదేవ నీ బుగ్గను కాటుక
దిద్దిన సఖి యెవరోయీ ఆ
దిద్దిన సఖి యెవరోయీ ?

వెంకట　　గ్రక్కిన చెమటను జారిన కస్తూరి
చుక్కబొట్టె ఓ మగువా ఇది
చుక్కబొట్టె ఓ మగువా !

అలమేల్	చక్కని నీ కొనగోరులు వంగిన
చందం బది యేమోయీ ఆ
చందం బది యేమోయీ?

వెంకట	పొలతి రొమ్ముని బాణారుని ముష్ఠిని
పొడిచితె వంగెనె చెలియా అవి
పొడిచితె వంగెనె చెలియా!

అలమేల్	చెలులను గూడుకు సరసము లాడిన
చిహ్నా లున్న వేమోయీ ఆ
చిహ్నా లున్న వేమోయీ?

వెంకట	భామరొ నే నేమెరుగను బల్
పాము నను బట్టేనే బల్
పాము నను బట్టేనే!

అలమేల్	పాము మీాద నాట్లాడిన వారికి
పట్టుకున్న భయ మేమి చే
పట్టుకున్న భయ మేమి?

వెంకట	అతివల నెవ్వరి కలియ లేదని
అగ్ని నైన మ్రింగెదనే కా
రాగ్ని నైన మ్రింగెదనే!

అలమేల్	అడవి కాల్చి కార్చిచ్చు మ్రింగిన
అగ్ని యందు భయ మేమి నీ
కగ్ని యందు భయ మేమి?

వెంకట	శషభిషలని నను నమ్మవు, నేనిక
విషమైనను మ్రింగెనే, నే
విషమైనను మ్రింగెనే!

అలమేల్	విషధర దానవి చన్నులు గుడిచిన
విష మెక్కున గుణధామా నీకా
విష మెక్కున గుణధామా?

**వెంకట** తప్పు లేదు నన్ గావవలె యిక, నీ
దయతో అలమేల్మంగా, నీ
దయతో అలమేల్మంగా !

**అలమేల్** తప్పు గాచెదను ఒప్పుగను, నీ
పేరు చెప్పు గుణధామా, నీ
పేరు చెప్పు గుణధామా !

**వెంకట** నాపేరు విరివిగ తిరుమల కొండను
వెలసిన వెంకటేశుడనే చెలియ, నే
వెలసిన వెంకటేశుడనే చెలియా !

**అలమేల్** సరసిజాక్ష నీ వింతసేపు ఏ
స్థలమున నున్నావోయీ ఏ
స్థలమున నున్నావోయీ?

# అలక పాటలు

## బావ నీదు బొల్లలుకలు

### కమాచ్ రాగం – త్రిశ్రం

పా ద – సా ని – ని ద ప – మ గ మ

బా వ నీ దు బొ – ల్ల లు క లు

పా ప – దా ని – సా , — , , , ॥

పా టి సే తు రా ——— ॥

ప ద రి – సా ని – ని ద ప – మ గ మ

బా – వ నీ దు బొ – ల్ల లు క లు

పా ప – దా ని – సా ని – రి సా ॥

పా టి సే తు రా – ——

దా ద – సా రి – గా రి – సా రి

రీ వి చూ సి మో స పో యి

గ ప మ – గా రి – సా , — , , , ॥

భా – మ ని త్తు రా —— ॥

### పాట

(1) బావ నీదు బొల్లలుకలు
పాటి సేతురా,
రీవి జూసి మోసపోయి
బామ నిత్తురా!

(2) కాసు వీస మైన తేగ
నోచ మైతిమీ,

పేచి పెట్టి ధనము లాగు
నీమడా సుమీ !

(3) అన్ని కట్నముల నొసగి మా
అక్క నియ్యగా,
వన్నె కదా నిన్ను కన్న
వంశము కెల్లా !

(4) ధర తిరుమలదా సార్చితు
తెగ భజించక
సరసంబులతో కాలము
సరిపుచ్చుదువా ?

# అలకపాట

## వయ్యారి వదినా నీవలగితివా బాలు

### కమాచ్‌రాగం — త్రిశం

| | | |
|---|---|---|
| ; ప పా ప | । | ప ద ప మ్మా గ |
| వ య్యా రి | | వ ది న నీ - |
| గ మ ప ద దా | । | ద స ని దా , |
| వ ల గి తి వా | | బా —— లూ |
| ; స సా స | । | సా స ని రి స సా |
| వె య్యా రు | । | వి త్తూ - మూ —— |
| ; ని ద ని దా పా | । | గ మ ప ద ప ద స ని ॥ |
| వే వే —— గ | । | ఇ టు ర - మ్మ్మా —— ॥ |
| ; ద | | |
| - ॥ | | |

### పాట

(1) వయ్యారి వదిన నీ
వలగితివా బాలు
వెయ్యారు విత్తూము
వేవేగ యిటు రమ్మా !

॥ వయ్యారి ॥

(2) ధనమును లాగగ
తగిన దానవు నీవె
అనుమాన మేలనే ?
అతివరో జాణవే !

॥ వయ్యారి ॥

(3) టక్కుల మారివి !
చిక్కులు పెట్టి
సిగ్గెక్కడో విడచి
ధనమెక్కుడు లాగగ ! ॥ వయ్యారి ॥

(4) గడుసుదానవె మంచి
గద్దరివె సుమ్మా!
ఒడుపు పేయగ మంచి
ఓర్పు జేతువు సుమ్మా ! ॥ వయ్యారి ॥

(5) ధరను శ్రీ తెన్నేరు
పుర వేణుగోపాలు
కరుణ గోరగ నీదు
కఠినంబు జూపేవ ! ॥ వయ్యారి ॥

# మిధునవిడెములు (దంపత్తాంబూలాలు)

## అందరె మిధున విడెములు

**బిలహరిరాగం — ఆదితాళం**

సా , రి గా ప ప । దా స ని ఊా ని ప
అ ం ద రే మి ధు । నా వి డె ము - లు
ప ద ని దా ప మ గ । రి ప మ గ సా , , ॥
అ బ ల లా ర అ - । న ం ద ము గా —
సా రి రి గ పా ప । ద స స ని ద ని దా ప ప
స ం ది య ము తే ల । నే - మీా - ప తు - ల తో
ప ప ప ద ని ద ప ప । మ గ రి ప మ గ రి స
స ర స ం బు ల నా - । డు చు వే - వే - గ మె ॥

పాట

(1) అందరే మిధున విడెములు
అబలలార ఆనందముగా!
సందియము లేలనే మీాపతులతో
సరసంబుల నాడుచు వేవేగమె!

॥ అందరె ॥

(2) దంపతులు పొన్నున దనరుచు, బహు
సొంపగు తమ్మళ మందివ్వగ,
ఇంపుతో మీాభర్తలు గైకొని
ఇడెదరు మీాకిట, ఇదె సమయము గద!

॥ అందరె ॥

(3) చంద్ర బింబాననలారా! మన
మందున సంతస మొందగ, నే
డందుకొనదగు నిందు, సిగ్గుల
నంద చెల్లదు అంద మొందగా !

॥ అందరె ॥

(4) రామలారా! తిరుమలరాయుని
రక్షించెడి రుక్మిణిలోలుని
ప్రేమతో భజియించపుడి, మిధునము
శ్రీమీరగ వర్ధిల్లగ, ముదముతో !

॥ అందరె ॥

# పెళ్లికొడుకుని వెటకారం

## ఇదేమి పెళ్లికొడుకె చెలీ

### హరికాంభోజి స్వరాలు — త్రిశ్రం

| | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | । | స | రి | మ | - | మా | మ | | - | గా | గ | రి | - | రి | రి | గ | | |
| ఇ | । | దే | - | మి | | పె | ళ్లి | | | కొ | డు | కె | | చె | లీ | - | | |
| స | రి | స | - | | | ని | ద | ని | - | సా | , | - | | రి | రి | గ | | |
| ఇ | ం | త | | | | అ | గ | డ | | మా | | | | చె | లీ | - | | |
| స | రి | స | - | | | ని̣ | ద | ని | - | సా | , | - | | , | , | , | | |
| ఇ | ం | త | | | | అ | గ | డ | | మా | | | | —— | | | | |

### పాట

(1) ఇదేమి పెళ్లికొడుకె చెలీ
ఇంత అగడమా చెలీ
ఇంత అగడమా ! ॥

(2) పర కాంతల గని నవ్వును
సరసంబు లాడ బోవున్, చెలీ
సరసంబు లాడబోవున్ ! ॥

(3) ఇక ఎట్లు సేతుమే, చెలీ
ఇంత అగడమా చెలీ
ఇంత అగడమా ! ॥

(4) గంధ మలద రారయనీ,
సుందరు లిటు బిలువ, చెలీ
సుందరు లిటు బిలువ ! ॥

(5) ఇందెందు బోయెనో, చెలీ
ఇంత ఆగడమా, చెలీ
ఇంత ఆగడమా ! ॥

(6) చెండ్లాట లాడు వేళన్,
కడు చిరుతనంపు లీలన్, చెలీ
కడు చిరుతనంపు లీలన్ ! ॥

(7) మొగమ్ము పైన నివురు, చెలీ
ఇంత ఆగడమా, చెలీ
ఇంత ఆగడమా ! ॥

# ఏమని నే తెల్పుదు ఈ పెళ్ళికొడుకు చరిత్ర

మాయామాళవగౌళ — త్రిశం

| | | | | |
|---|---|---|---|---|
| సా గా [2] , మ [1] | - పా దా [1] , మ | - పా , ; | - ; , పా | |
| ఏ మా ని | నే దె ల్పు | ,దూ ——— | ఈ | |
| ద స స నినిద | - పా పా ప మ | - మపాదపమ | - గమగరిసస | |
| పె ళ్ళి కొడుకు | చ రి త్ర - | ఈలా - గు- | ను — న్నాది | |
| ; దపా ద | - ని స సా సా | - సా స సాస | - నీదనిసస | |
| పట్నాము | నుంచి మేము | పొంకోళ్లు | తె-ప్పి-స్తె | |
| ద సా సా ని | - దా ప పాప | - పాద పామ | - గారిససస ॥ | |
| తొడు క్కోడం | బాత కాదు | తోలు కాళ్ల | పెళ్లికొడుకు॥ | |

పాట

ఏమాని నేదెల్పుదూ! ఈ
పెళ్లికొడుకు చరిత్ర, ఈలాగు నున్నాది! ॥
॥ ఏమాని నే దెల్పుదూ ॥

(1) పట్నాము నుంచి మేము, పొంకోళ్లు తెప్పిస్తె,
తొడుక్కోడం బాతకాదు, తోలుకాళ్ల పెళ్లికొడుకు!
॥ ఏమాని నే దెల్పుదూ ॥

(2) ఆకులూరి నుంచి మేము, ఆకులు, వక్కలు, తెప్పిస్తె,
వేసికోడం బాతకాదు, బోసినోటి పెళ్లికొడుకు! ॥
॥ ఏమాని నే దెల్పుదూ ॥

(3) బందరు నుంచి మేము, బైస్కిళ్లు తెప్పిస్తె,
ఎక్కరాదు, తొక్కరాదు, బోదకాళ్ల పెళ్లికొడుకు!
॥ ఏమాని నే దేల్పుదూ ॥

# ఏమాని నే చెప్పేదన్

"ఏమాని నే దెల్పుదూ" వలె

మాయామాళవగౌళ — త్రిశం

ఏమాని నే చెప్పేదన్ – ఈ
పెండ్లికొడుకు చరిత్ర ఈలాగు నుండెనట ! ॥

॥ ఏమాని ॥

(1) ఇస్కోలు జీతమట, ఇచ్చి పుచ్చుకుంటడట,
కాపిహొటలు కెల్తడట, బాగా భోంచేస్తడట ! ॥

॥ ఏమాని ॥

(2) అత్త ఇంటి కెల్తడట, బాగా భోంచేస్తడట,
అయిదు గంటలవగానే అచ్చులోజేలంటడటడ !

॥ ఏమాని ॥

(3) ఈదులోకి ఎల్తడట, దొంగతనము చేస్తడట,
వారానికి రెండుసార్లు, జైల్లో కెళ్తడట ! ॥ ఏమాని ॥

(4) వాసనలేని సెంటుబుడ్లు, మరీమరీ రాస్తడట,
మాటిమాటికి రాస్తేను, మర్యాద తక్కువట !

॥ ఏమాని ॥

(5) అరకట్ట ఆకులట, అర్ధశేరు వెక్కలట,
ఏసికోడం చాతకాదు, ఎర్రిమొకం పెళ్లికొడుకు !

॥ ఏమాని ॥

# ఏమయా ఓ పెండ్లికొడకా

## ఖరహరప్రియ స్వరాలు — మిశ్రచాపు

ప ప ప పా ప ద । సా ని ద ద నీ ద
ఏ - మ యా ఓ - పె ం డ్లి కొ డ కా -
పా ద ప మా మ గ । రీ గ[2] మా , ,
ఎ ం త కీ రి తి తె స్తి వీ —
రీ గ[1] రీ రి స । రీ గ[2] మ ప పా
ఎ ం త కీ రి తి తె స్తి వీ - నీ
మా మ గ[1] గ[1] రీ । గ[1] స స సా , , ॥
వె ం త కీ రి తి తె - స్తి వీ — ॥

### పాట

(1) ఏమయా ఓపెండ్లికొడకా
ఎంత కీరితి తెస్తివీ — నీ
వెంత కీరితి తెస్తివీ— నీవెంత కీరితి తెస్తివీ ? ॥ ॥ ఏమయా ॥

(2) పొంత కాగిన నీళ్లు మేము,
పోసి చూస్తా మంటిమి,
తొట్టిలోని ముసురు నీళ్లు,
నాకు కావలె నంటివీ ! ॥ ఏమయా ॥

(3) సన్నబియ్యం, కోడిపెట్టా,
మేము పెడతా మంటిమీ,
రాగిముద్దా, ఉలవచారు,
నాకు కావలె నంటివీ ! ॥ ఏమయా ॥

(4) తూగుటుయ్యాల, ఒరుగు దిండూ,
మేము ఇస్తామంటిమీ!
పాత బాపలు, పంచటరుగులు,
నాకు కావలె నంటివీ ! ॥ ఏమయా ॥

(5) పట్టె మంచం, లేపుదిండూ,
మేము ఇస్తామంటిమి,
నులకమంచం, కృమిటికోరీ,
నాకు కావలె నంటివీ ! ॥ ఏమయా ॥

(6) పచ్చి బోగం చిన్నదాన్ని,
పక్కనేస్తా మంటిమీ,
ఎంట సాకిన గుల్లి కుక్క,
నాకు కావలె నంటివీ ! ॥ ఏమయా ॥

# మరియాదగా లేచిరా ఓ పెళ్లికొడకా

బిళహరిరాగం — మిశ్రచాపుతాళం

(1) స నీ - దా పా । మా గ - రి గ మ గ
మ రి యా దా గా - లే - చీ -
పా , - , , గ గ । పా ప - గ ప ద ని ॥
రా —— ఓ - పె ల్లి కొ డ కా -

(2) గ గ గ - పా ప ద । సా స - రీ , ,
స భ లో యం ద రు మె చ్చి రీ —
స రి గ - సా స ని । దా రి - సా , ,
చిం పి కం బ ళి క ప్పి రీ —
ద ద ద - గా గ రి । సా ని - ద ప ప ద
బా - ల గా మీ- అ య్య లం ద రు
ద ని ద - పా మ గ । గా గ. - పా ద ని ॥
బా - ల సం తో - షిం చి రీ — ॥

(3) స నీ - - దా పా । మ గ రి - సా , ,
స నీ దా పా । మ గ రి సా —
, , , - , , గా । పా ప - గ ప ద ని
—— — మీ అ క్క లం ద రు
ద స ని - దా పా । మ గా - రి గ మ గ
సం - గీ త ము లు పా - డ -
సా, - , , గా । పా ప - గ ప ద ని
గా — మీ అ క్క లం ద రు

## పాట

(1) మరియాదగా లేచి
రా। ఓ పెళ్లికొడకా! ॥

(2) సభలో అందరు మెచ్చిరీ,
చింపి కంబళి కప్పిరీ,
చాలగా మీ అయ్యలందరు
చాల సంతోషించిరీ!

॥ మరియాదగా ॥

(3) సనీ దాపా మగరిసా,
మీ అక్కలందరు,
సంగీతములు పాడగా,
మీ అక్కలందరు!

॥ మరియాదగా ॥

(2) సభలో అందరు చూడగా,
(వలె) చక్కగా మీవారుగా,
చాటుగా మీ అయ్యలందరు,
చాల సంతోషించిరీ!

॥ మరియాదగా ॥

# ఇతడేనా పెండ్లికుమారుడూ!

## నవరోజురాగం — మిశ్రచాపుతాళం

, గ ప - మా గా । రి మ గ - రి స స స
ఇ త డే నా పెం - డ్లి - - కు

సా , సా , గ రీ , గ రీ రి గ । మా , - , , గ రి
మా — — — రు డూ — ఈ -

రీ రి - ప మా గ - । రి మ గ - రి స సా
- అ - ధ్భు త కా - రు డిం త

, , స - సా గ రి గ గామ । పా , - ప ద ద ప
— సుం దా — రు డూ —

మ గ మ - మ గ రి స । , , , - , , , , ॥

### పాట

(1) ఇతడేనా పెండ్లి కుమారుడూ ! - ఈ
అధ్భుతాకారు డింత సుందరుడూ ! ॥ ఇతడేనా ॥

(2) వర్ణమున కందని రూపము ! — వీని
హొయలు చూడ వహహా విచిత్రమూ ! ॥ ఇతడేనా ॥

(3) ఎన్నెన్నొ విధముల గాత్రము ! — మున్ను
ఎన్నొ డెరుగమె ఈ అవతారము ! ॥ ఇతడేనా

(4) పంకజభవనుతు డందురూ, — ఇతని
శంకచక్రధరుడని అందురూ ! ॥ ఇతడేనా ॥

(5) వంక లేని వాడని అందురూ, — ఇతని
వెంకమాంబార్చితుడని అందురూ ! ॥ ఇతడేనా ॥

# పేరుచెప్పుమటన్న పెదవులతడిపేవు

## పెళ్లి కొడుకు మీద పద్యం

### ఆనందభైరవి

గా మ ప పా ̇ప ప    పా , మ
పే - రు చె ప్పు మ    ట న్న
గ మ ప మ మ మ    మా ప మ గా రి స
పె ద వు ల ద డి    పే — — వు
ప̣ సా స స మ గ రి    రీ గ రీ గ
పా - ర ప ం డ్ల న్ని    యు - ——
గ మ ప మ గ రి    స రి గ రి గా , స
బై - ట - ప డు నా    ————————

### పద్యం

(1) పేరు చెప్పుమటన్న పెదవుల దడిపేవు!
పారపండ్లన్నియు బైటపడున?

(2) పేరు చెప్పుమటన్న మారు బల్కవదేమి!
నత్తియా, నంగియా, నాల్కకురచ?

(3) పేరు చెప్పుమటన్న పెడచెవిని బెట్టేవు!
బధిరత్వ మెల్లను బైట బడున?

(4) పేరు చెప్పుమటన్న వారగా జూతువు!
గారాబమా, లేక కనుల తీరా?

పార పండ్లైన, నత్తైన, బధిరమైన,
గారబంబైన, తప్పునా, గాన, యిపుడు,
నీదు కేల్ బట్టి నిలచిన నీరజాక్షి
పేరుజెప్పుమ, వేవేగ పెండ్లికొడక ॥

# పెళ్లికొడుకుని ఎగతాళి పద్యం

మోహనరాగం

గ గ ప ప    ప ప ప ప

ము రు గు లు    గో లు సు లు

పా ద స ద ప    ద ప గ రి స̣ స

గం భీ - ర మె    గా ——— ని

సా రి గ ద ద ప    గ రి స స సా

వ్రా త వ్రా - యు ట    వీ - ని కి

స రి గ రి స    సా స

చే - త కా ——    - దు ॥

పద్యం

(1) మురుగులు గోలుసులు గంభీరమె గాని,
వ్రాత వ్రాయుట వీనికి చేతకాదు !

(2) ఫలహారములు చేసి పవ్వళించుటె గాని,
కార్యభారము మీద కాంక్ష లేదు !

(3) ఇంత చక్కని వరుడెక్కడ దొరకెనమ్మ ?
కలికిరో ! రుక్మిణి పూర్వ పూజ యిట్లు !

# పెళ్లికొడుకుని ఎగతాళి పద్యం

జ - ఝూటిరాగం

(1)

| | |
|---|---|
| గా గా గ | గా గా గ |
| సా రం గి | ప ట్నా న |
| రి గ మ గ | రి ప సా సా |
| చా - క లి | ఎ రి గిం ట |
| సా రీ మ గ గ రి | సా రి స |
| మీా య —— | న్న మూా —— |
| ని ద ని ప | ద ని స సా , స |
| —— ట లు | మోా య లే దె |

పద్యం

సారంగి పట్నాన, చాకలి ఎరిగింట,
మీాయన్న మూాటలు మోాయలేదె!

(2) కలుకంచు కలుకంచు కంచునటి వీధిలో,
కల్లు సారాయి బుడ్లు అమ్మలేదె!

(3) అడవి తంజావూరు, మళయాళ దేశమున,
ఆరుకోట్ల చోట్ల చేరి, పంచాంగం మీాయన్న చెప్పలేదె!

(4) ఇందరు గుమిగూడి లోబడిన వారు,
ఇక్కడేమి పనిలేదు, లేచి పోవయ్య పెళ్లికుమారా!

# పల్లెటూరి హాస్యం

## నిన్న దిన్న విస్తళ్లు నెట్టు లడ్డాయి

### త్రిరాగ స్వరాలు — ఝంపె

స స రీ మ । మా మా మ । గా మ గ రి । రి స సా ,
ని న్న ది న్న । వి స్త ళ్లు । నె ట్టు ల - । డ్డా - యి
ని ని స స రి । రి రి గ రి స । నీ స నా । సా సా ,
నీ తి మా లి న । పె ళ్లి కొ డ క । లే చి రా । వ య్యా ॥

### పాట

(1) నిన్న దిన్న విస్తళ్లు నెట్టు లడ్డాయి
నీతి మాలిన పెళ్లికొడక లేచి రావయ్యా ॥

(2) మొన్న దిన్న విస్తళ్లు మోపు లడ్డాయి
మొండి పెళ్లి కొడక లేచి రావయ్యా ॥

(3) ఏనుగులు లేవని ఏలడిగినారు
యెల్ల గాడిద లెక్కి లేచి రావయ్య ॥

(4) గుఱ్ఱాలు లేవని ఏలడిగినారు
గుడ్డి కుక్కానెక్కి లేచి రావయ్య ॥

(5) పల్లకీలు లేవని ఏలడిగినారు
పందికొక్కు నెక్కి లేచిరావయ్య ॥

(6) మేనాలు లేవని ఏలడిగినారు
మేకపోతు నెక్కి లేచిరావయ్య ॥

# మొరటు సరసం

## భళిభళీ పెళ్ళికొడుక

### హరికాంభోజి స్వరాలు — ఝంపెతాళం

ని ని స రి స ॰రి రి రి రి రి
భ ళి భ ళీ - పె ళ్లి కొ డు క
ని ని స రి స రీ రి రీ
బ - ళ్లా - రి సీ మ లో
స స రి మ మ గ రి రి రి గ
పు - ల్లా - కు తూ - టు గా -
రి స స సా । సా , , , ॥
పొ డి చి నా డూ —— ॥
నీ సా రి సా రి రి రి
ఎ ద్దు చ్చ పో య ం గ
నీ స రి స రీ రి రి రి
ఏ రు లై - పా ర ం గ
స స రి మ మ గ రి రి రి గ
తా - టా - కు తె - ప్ప చే -
రి స స సా సా , , , ॥
దా - టి నా డు —— ॥

## పాట

భళి భళీ పెళ్లి కొడుక
బళ్లారి సీమలో
పుల్లాకు తూటుగా! పొడచినాడు

బావ మరదులు వచ్చి పలుకరించగ బోవ
కిమ్మనక పరుగు లంకించినాడు
చెట్టు పై కొమ్మన చేరి కాకాయన

అట్టే భయపడి కేక పెట్టినాడు
కట్టమీదున్న గుడ్డి కొంగలను చూచి
దయ్యములటంచు ఒక మూల దాగినాడు

అల్లుడని పిల్చి ఆదరింప మానాన్న
ఎరుగకే అలిగి తన ఊరికెళ్లినాడు
ఏడదొరికాడు మాకు ఈ ఎడ్డి బావ!

# పెళ్లికూతురి మీద పాటలు

## పెళ్లికూతురా పెంకితన మేలానే

### పుష్పలతిక రాగం — ఆదితాళం

; ; ; రీ - మా పా సా నీ ।
పె ళ్లి కూ - తు
సా ; ; స రి - స ని పా పా ప మ ॥
రా —— పె ం కి - త న మే -
రి గా గ రి స రీ రీ , రీ , స ని
ల - నే — ప ళ్లు బై ట -
సా , సా , స రి స నీ పా , ప మ
పె ట్టి ప - క్కు - న న -
రి గ గ రి సా ॥
వ్వట త గు నా ॥
; ; ; పా సా , ని సా సా ।
వ న్నె - లా డి
రీ రీ రీ సా రీ , స రి మా రి ॥
ను డు వా వ య్యా రా —— మే
గ రి సా , సా స రి రి గ రి సా స ని
మం - దూ ఎ న్న - డు - చూ -
పా , మా , పా స నీ పా , ప మ ॥
డా మూ మే - టి జా ణ రో
రి గ గ రి సా ॥
చా - ల —— ॥

## పాట

(1) పెళ్లి కూతురా
పెంకి తనమేలనే
పళ్లు బయట పెట్టి
పక్కున నవ్వుట తగున!

॥ పెళ్లి కూతురా ॥

(2) వన్నెలాడి నుడువా
వయ్యారా మేమందు
ఎన్నాడూ చూడము
మేటి జాణరో వాల!

॥ పెళ్లి కూతురా ॥

# చుక్కల్లో చంద్రుడమ్మ

## హరికాంభోజిస్వరాలు — చతురశ్రం త్రిశ్రం

### చతురశ్రం

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మ | ప | దా | ని | ద | ప | ప | పా | ఎ | ద |
| చు | క్క | ల్లో | — | | చం | ద్రు | డ | - | మ్మ |
| మ | పా | మ | | | గా | మ | గ | రి | స |
| మా | పె | ళ్లి | | | కొ | డు | - | కు | - |

### త్రిశ్రం

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సా | స | - | రి | మ | గ | - | రీ | రి | - | రి | రి | గ |
| చు | ప్ప | | నా | - | తి | | దా | న | | వ | - | మ్మ |
| రి | స | స | - | సా | స | - | సా | , | - | , | , | , ॥ |
| పె | - | ళ్లి | | కూ | తు | | రా | | | ——— | | ॥ |

### పాట

(1) చుక్కల్లో చంద్రుడమ్మ
మా పెళ్లి కొడుకూ
చుప్పనాతి దానవమ్మ
పెళ్లి కూతురా ॥ చుక్కల్లో చంద్రుడమ్మ ॥

(2) అత్త మామలు గలవాడు
మా పెళ్లి కొడుకు
అణగి మణగి మెలగుమమ్మ
పెళ్లికూతురా ॥ చుక్కల్లో చంద్రుడమ్మ ॥

(3) వదిన మరదళ్లు గలవాడు
మా పెళ్లికొడుకు
వద్దికతో తిరుగు మమ్మ
పెళ్లి కూతురా

॥ చుక్కల్లో చంద్రుడమ్మ ॥

(4) బావమరుదులు గలవాడు
మా పెళ్లి కొడుకు
భావించి తిరుగుమమ్మ
పెళ్లికూతురా

॥ చుక్కల్లో చంద్రుడమ్మ ॥

(5) అన్న దమ్ములు గలవాడు
మా పెళ్లి కొడుకు
అణగి మణగి మెలగు మమ్మ
పెళ్లి కూతురా

॥ చుక్కల్లో చంద్రుడమ్మ ॥

(6) చుక్కల్లో చంద్రుడమ్మ
మా పెళ్లి కొడుకు
చుప్పనాతి దానవమ్మ
పెళ్లి కూతురా

॥ చుక్కలో చంద్రుడమ్మ ॥

# పెళ్లికూతురు వర్ణన

## గిజిగిజి గూడయా, గిజిగాడు గూడయా

### పద్యం — ఆనందభైరవి రాగం

స స స పా  పా ప పా
గి జి గి జి  గూ డ యా
గ మ పా మ  గా రి గా
గి జి గా డు  గూ డ యా
గ మ పా మ  గా రి సా
టెం ం కా య  చి ప్ప యా
రి గ రి సా  సా సా ,  ॥
వె లి యమో  ము —  ॥

### పద్యం

గిజి గిజి గూడయా,
గిజి గాడు గూడయా,
టెంకాయ చిప్పయా,
వెలియ మోము!

ఇనుమ సళాకయా,
ఎనుపోతు చర్మంబు
గోరింట తీగయా,
కొమ్మ కురులు!

రాతి రోలుకు సరివచ్చు,
నాతి నడుము
ఊరపందికి సరివచ్చు,
ఉవిద స్వరము
కొండ ముచ్చుకు సరివచ్చు
కొమ్మ గుణము!

# వదిన వర్ణన

## ఏదిర వదినేదిర

### కేదారగౌళ — త్రిశ్రగతి ఆదితాళం

| | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వ | ని | ద | - | ప | మ | గ | - | రి | మ | గ | - | రి | స | స | | |
| ఏ | - | ది | | ర | వ | ది | | నే | - | ది | | ర | వ | - | | |
| రి | మ | - | - | ప | ని | మ | - | ప | ని | ద | - | పా | , | ॥ | | |
| య్యా | రి | | | ర | స | ం | | సా | - | రి | | రా | | ॥ | | |

పాట

(1) ఏదిర వదినేదిర, వ
య్యారిర, సంసారిరా
॥ ఏదిర ॥

(2) వీపు జడలది, తోపు రవికెది,
లోపటి తాబొందుదీ
॥ ఏదిర ॥

(3) విజయనగరం, గోరుకొండ,
వీధిలో వదినంగడి
॥ ఏదిర ॥

(4) అత్త మామల మాటకెపుడు
అడుగు దాటని చిన్నదీ
॥ ఏదిర ॥

(5) నడి బజారు నంగడిలో
నుండేటి మర్యాదదీ
॥ ఏదిర ॥

# చింపితల చిక్కుతీసి

## ఖరహరప్రియ — ఆదితాళం

(1) ; ద ని - సా సా - సా సా - సా సా

చింపి త • ల చి క్కు తీ సి

; ప స - నీ దా - పా దా - మా పా

స ం పెం గ నూ నె రా సి

; మ ద - దా దా - ద ని సా - ; ని ద

సొ ం పు గ గ - ట్టి తి -

పా పా - ప ద ద ప - మా గా - రీ సా

వే - ——— వ ది నా -

సా , గ - రీ , గ - మా మా - గ గ రీ

పే డ గం ప ఏ డ బె డి తి

సా ; - ; ; - పా పా - దా పా

వే — —- వ ది నా -

మా , మ - రీ , గ - మా మా - గ గ రీ

పే డ గం ప ఏ డ బె డి తి

పా ; - , ; - ; ; - ; ; ॥

వే — ——— ——— —— ॥

పాట

(1) చింపితల చిక్కు తీసి
సంపెంగ నూనె రాసి
సొంపుగ గట్టితివే - వదినా

పేడగంప ఏడబెడితివే – వదినా
పేడగంప ఏడబెడితివే

॥ చింపితల చిక్కుతీసి ॥

(2) దినమొక జత సొమ్ము
కొని పెట్టితినె సొమ్ము
చిన్ననాడె అమ్మితివే - వదినా
చింతకాయ గంప ఏడనే - వదినా
చింతకాయ గంప ఏడనే

॥ చింపితల చిక్కుతీసి ॥

(3) ఔనౌనె ఓసి ఓసి
ఔనౌనె ఓసి ఓసి
చాలును చాలులేవే - వదినా
సరసంబు లాడరావే వదినా
సరసంబు లాడరావే

॥ చింపితల చిక్కుతీసి ॥

# వదిన భోజనం

## ఏమే ఓ వదినా నీవీ భోజన మెటునేర్చితి

**హరికాంభోజీ — త్రిశ్రం**

పా ద[2] ప మ[1] గ, మ ప పా సా
ఏ మే - ఓ - వ ది నా నీ
సా సా స ప ప ద ని స రి స ని ద
వీ భో జ న మె టు నే —— ర్చి తి ॥ ఏమే ॥

(1) స స స ని దా ని ద పా ద ని స రి సా
తి య్యకం — దా — నే తి లో - న
, స రి గ మ గా రి గ మ ప మ గ రి స స
ది వ్య ము గా - వే ———— - చి మే - ము
స రి గ మ మ గ రి గ మ ప మ గ రి స సా
వి య్య పు రా ల ని వై ————— చి - నా
ద ని స రి రి స ద ని స రి స ని ద మ
కో య్యకూ- ర - తె —— మ్మని యె ద

**పాట**

(1) ఏమే ఓవదినా నీ
వీభోజన మెటునేర్చితి ?
॥ ఏమే ॥

తియ్యకందా నేతిలోన
దివ్యముగా వేచి మేము

వియ్యపురాలని వైచిన,
కొయ్యకూర తెమ్మని యెదవు !

॥ ఏమే ॥

(2) పంచదార పాలతో, గా
పించిన పరమాన్న మిడిన,
కొంచెము తిని కారము లే
దనుచు నావల త్రోసెద !

॥ ఏమే ॥

(3) తోడుకొనిన పాలమీగడ
తో, వడ్డన చేయుచుండ,
నాడెము కాదిది మాకని
నామోము చూచెద విది !

॥ ఏమే ॥

# పల్లెటూరి వదిన హాస్యం

## ఎంతదానివే వదిన

### హరికాంభోజి—త్రిశ్రం

గ గ గ - గ మ గ - రి స స - స సా
ఎ ం త దా - ని వే - వ ది నా
రి ప ప - ప ప మ - గ మ గ - రి స రి
ఏ ం త మ ష లు చే - స్తి వే —— ॥
రి మ మ - మ మ మ - మా మ - మా గమ
ఏ ం త మ ష లు చే స్తి వే ——
ప ద ప - మ మ మ - గ మ గ - రి స స ॥
బ ల్ త మ ష లు చే - స్తి వే —— ॥

### చతురశ్రం

రి మామ - మా గ మ - పా పా - పా పా
కా - కీ నా డా - కలగా టే రూ
దా ద ద - దా ని ద - పా , ద - మ పా ,
కౌ సుల పే రు నీ క ం పె న టే - క ట్టి
దా ద ద - దా ద ద - పా ద ప - ప మ మా
కా సు ల పే రు నీ కం పే - న టే -
ప ధా ప - మా మ ప - గ మా గ - రీ సా ॥
కా కీ - నా డ కు ర మ్మ నె న టే

పాట

(1) ఎంత దానివే వదిన
ఏం తమషలు చేస్తివే
ఏం తమషలు చేస్తివే
బల్ తమషలు చేస్తివే ॥ ఎంతదానివే ॥

(2) కాకినాడ కలకటేరు
కాసుల పేరు నీ కంపెనటే — కట్ట
కాసుల పేరు నీ కంపెనటే
కాకినాడకు రమ్మనెనటే ॥ ఎంతదానివే ॥

(3) రాజమండ్రీ రామారావు
రవికెలు చీరలు అంపెనటే
రవికెలు చీరలు అంపెనటే
రాజమండ్రికి రమ్మనెనటే ॥ ఎంతదానివే ॥

(4) విజయనగరం మహారాజు
కోరిన చీరలు అంపెనటే
కోరిన చీరలు అంపెనటే - నిన్
కోరుకొండకు రమ్మనెనటే ॥ ఎంతదానివే ॥

(5) చిన్నవైసుల మైసూరు సాహెబు
జోడు గుర్రాల బండంపెనటే
జోడు గుర్రాల బండంపెనటే
జోడుగ నిన్నే రమ్మనెనటే ॥ ఎంతదానివే ॥

# పెద్ద వదిన తన్నుబోలు

## శంకరాభరణ స్వరాలు — త్రిశ్రం

పా రి - స స ని - ధా ని - సా స
పె ద్ద వ డి న త న్ను బో లు
సా రి - గా మ - గ గ రి - సా ని
పె ద్ద కో తి నా క టి పెం చి
సా రి - సా ని - ధా ని - పా ప
ము ద్దు ము ద్దు చే యు నం త
ధా ని - స స రి - సా , - , , , ॥
ము క్కు క ర చె నూ ——— ॥
ద సా - ద సా - రి సా - , , , ॥
సు వ్వీ సు వ్వా ల్లా లే ———
ద సా - ద సా - రి సా - ——— ॥
సు వ్వీ సు వ్వా ల్లా లే ——— ॥

### పాట

(1) పెద్ద వదిన తన్నుబోలు
పెద్ద కోతి నొకటి పెంచి,
ముద్దు ముద్దు చేయునంత,
ముక్కు కరచేనూ !

సువ్వీ సువ్వాల్లాలే,
సువ్వీ సువ్వాల్లాలే !

(2) టెక్కు లాడి పెద్ద వదిన
ముక్కు చేతబట్టుకుని

మొద్దు మొహాపు పెద్దన్న
వద్ద చేరెనూ ! ॥

సువ్వీ సువ్వాల్లాలే !
సువ్వీ సువ్వాల్లాలే ! ॥

(3) ఏమిసేతు పెద్దన్న
ఏమరించి ముక్కు కరచె,
ఏమి మందు వేతమయ్య
చిన్నన్నా ॥

సువ్వీ సువ్వాల్లాలే
సువ్వీ సువ్వాల్లాలే ! ॥

(4) గచ్చపప్పు తెచ్చి నీవు
ఉచ్చపోసి రంగ రించి
వెచ్చచేసి వెయ్యరమ్మ
వెఱ్రి చెల్లెలా ! ॥

సువ్వీ సువ్వాల్లాలే ।
సువ్వీ సువ్వాల్లాలే ! ॥

# వదినమీద ఫిర్యాదు

## అన్న వినుమా వదిన మాటలు

**హరికాంభోజి స్వరాలు — మిశ్రచాపు తాళం**

రీ గ - రి గ మా । గ గ రి - సా ని స
అ న్న వి ను మా వ ది న మా ట లు
రీ రి - రి రి గా । మ ప ప - ప మ గ మ
అ ద్భు త ము గా ను ం డె నూ - మ న
సా స - సా స ని । ద ద ని - ద ప ప ప
క న్న త ల్లి తొ జ గ డ మా - డ గ
రీ రి - రీ గ గ । మ మ ప - ప మ గ మ ॥
కా ర ణం బ ది ఏ - మి రా ——— ॥

పాట

(1) అన్న వినుమా వదిన మాటలు
అద్భుతముగా నుండెను — మన
కన్నతల్లితొ జగడ మాడగ
కారణం బదిఏమిరా ?

॥ అన్న వినుమా ॥

(2) అత్తగారికి ఆడపడుచుకు
అరకాసైనా ఇచ్చిరా ?
తత్తరపాటున తగు కట్నము
తప్పక ఇచ్చెద మనలేదా ?

॥ అన్న వినుమా ॥

# వదినకు పలుదోమింపులు

## వదినారో పలుదోము కొమ్మా

### ఖమాచ్‌రాగం — మిశ్రచాపు తాళం

| | | |
|---|---|---|
| ప సా నీ దా | । ప ద ప మ గ గా | |
| వ ది నా రో | ప లు - దో - ము | |
| గ గ మ పా , | । , ; ; పా | ॥ |
| కొ —— మ్మా | —— — నీ | |
| ద నీ సా సా | । ప స ని ని ద మా | |
| మ ది కో ర్కె | దీ —— ర్తు —— | |
| , ప ద ప ద స ని | । ని ద ప మ గ మా | ॥ |
| మ - మ్మా —— | —— —— | ॥ |

#### పాట

(1) వదినారో పలుదోము కొమ్మా – నీ
మదికోర్కె దీర్తు మమ్మా
॥ వదినారో ॥

(2) బంగరు పుల్లగై కొమ్మా ॥
శృంగారవతి వేగలెమ్మా
॥ వదినారో ॥

(3) సరసము గాదే మిటారి
జాగేలె లేవె వయ్యారి
॥ వదినారో ॥

(4) ధరణిలో తిరుమల సూరి
దలచేటి దైవము బ్రోచు
॥ వదినారో ॥

# వదినకు నలుగులు

## నలుగు పెట్టరె వదినకూ

**హరికాంభోజి స్వరాలు — త్రిశ్రగతి**

| | | | |
|---|---|---|---|
| గా గ | - గ మ గ | - రి స స | - సా , |
| నలుగు | పె ట్ట రె | వ ది న | కూ |
| ధ స స - | స స రి | - గ మ గ | - రి స రి |
| నా - తి | సుం ద రి | బొ - మ్మ | కూ —— |
| పా ప | పా ప | - ప ప ప | - ప గా |
| దుం ప | కొ మ్ము | ప సు పు | తో - |
| రీ రి - | గా , | గ మ ద ప | మ గా ॥ |
| దూల | కొం | డా —— | కు తో ॥ |

### పాట

(1) నలుగు పెట్టరె వదినకూ,
నాతి సుందరి బొమ్మకూ।
దుంపకొమ్ము పసుపుతో
దూలకొండాకుతో! ॥ నలుగు పెట్టరె ॥

(2) మంచినూనె మడ్డితో
మరిగేటి తారుతో
సీమ చింతాకుతో
సీమ మిరపకాయతో! ॥ నలుగు పెట్టరె ॥

(3) మల్లెలమ్మ మల్లెలు
మంచి సంపెంగలు
రమ్మనవె నలుగుకు,
నాతి సుందరి బొమ్మనూ! ॥ నలుగు పెట్టరె ॥

# పట్నవాసపు వదినని హాస్యం

## వదినరో మీరంత బహు జాణలమ్మ

మోహనస్వరాలు — ఝుంపెతాళం

గ గ గా రి - గ ప గా రి ,
వ ది నరో - మీ - రం త
స స స రి రి - గ గ రీ ,
బ హు జా - ణ ల - మ్మా
గ గ గా రి - గ ప గా రి
బ ల్ వై న గో - దా వ రి
సా రి స రి గ గ రీ ,
గ ట్టు వో - య - మ్మా ॥

పాట

(1) వదినరో మీరంత బహు జాణలమ్మ ।
బల్వైన గోదావరి గట్టు వోయమ్మా ॥ ॥ వదినరో ॥

(2) గిరగిరా తిరిగేటి గిల్కా వోయమ్మా
అరదిగ మాఇంటి పెద్ద కోడలవు ! ॥ వదినరో ॥

(3) బల్వైన బాలీలు తీరేయరమ్మ
బల్వైన గోదావరి గట్టు వోయమ్మ ! ॥ వదినరో ॥

(4) విశాఖపట్నం దారం లేసు అల్లుట కాదు
గిరగిరా తిరిగేటి గిల్కా వోయమ్మా ! ॥ వదినరో ॥

(5) చెన్నాపట్నం దారం బుట్టలల్లుటె కాదు
గిరగిరా తిరిగేటి గిల్కా వోయమ్మా ! ॥ వదినరో ॥

# వదిన వర్ణన

## అహా ఇదే మిదే మొదిన

### శంకరాభరణస్వరాలు — త్రిశ్రం

(1) ప పా - ద పా - మ గా - రి స స
అ హా ఇ దే మి దే మొ ది న
స సా రి రీ - గా మ - పా ,
ప రు గె త్తు చు న్న దీ

(2) దా ద - దా ద - దా ద - పా ద
వీ ర జా ర గా - —
నీ స - నీ ద - పా , - , , ,
వ న్నె మీర గా ——
పా ప - పా ద - ప ప మ - గ రి స
స న్ను తాంగి జ ల క మా - డె
స రీ - గా మ . - పా , - , , , ॥
స రి ప్రొద్దు నా ——

(3) దా ద - దా ద - దా , - ద ప ద ॥
చి న్న దా ని వా వ దిన ॥
నీ స - ని ని ద - పా , - , , ,
ఎ న్న డె రు గ వా ——
పా ప - ప ప ద - పా మ - గా రి
అ న్న మ న సు చి న్న బో యె
సా రి - గా మ - పా , - , , ,
వ న్నె లా డి వా ——

## పాట

(1) అహా ఇదే మిదే మొదిన
పరుగెత్తు చున్నదీ?

॥ అహా ఇదే మిదే మొదిన ॥

(2) చీర జారగా
వన్నెమీరగా
సన్నుతాంగి జలకమాడె
సరిప్రొద్దునా

॥ అహా ఇదే మిదే మొదిన ॥

(3) చిన్నదానివా, వదిన
ఎన్న డెరుగవా ?
అన్న మనసు చిన్నబోయె
వన్నెలాడివా ?

॥ అహా ఇదే మిదే మొదిన ॥

# వియ్యాలవారి మీద పాటలు

## వచ్చీరమ్మ వియ్యాలవారు

### బిళహరిరాగం — మిశ్రచాపుతాళం

స నీ దా పా ॥ మ గా రి గ మ గ
వ చ్చీ ర మ్మా వి య్యా లా - వా -
సా , , ; ॥ , ; ; ,
రూ ——— —— ———
స నీ దా పా ॥ మ రి గ - మ గ సా
వ చ్చీ ర మ్మా వియ్యాల వా - రూ
గా గ పా పా ॥ ప ప ప గ ప ద స
అ చ్చ మై న మ ర్కట ముల బా రు
గా గ - పా ప ద ॥ సా స - సా స స
ము చ్చ మూ తు లు క చ్చ గో చు లు
స రి గ - స స స స ॥ దా ద - సా స స
పె - చ్చు పె రి గి న బి ర్ర మీ స లు
దా ద - గ రి సా ॥ స స ని - ద ప దా
అ చ్చము గ కో తు ల ను వ లె నే
నీ ద - ప ప ప ప ॥ గా గ - ప ప ప ద
గి చ్చజ గ డ ము లా డు కొ ను చు -

## పాట

(1) వచ్చీరమ్మా వియ్యాలవారు
అచ్చమైన మర్కటముల బారు !

॥ వచ్చీరమ్మా ॥

ముచ్చు మూతులు కచ్చ గోచులు
పెచ్చు పెరిగిన బుర్రమీసలు
అచ్చముగా కోతులను వలెనే
గిచ్చజగడము లాడుకొనుచూ !

॥ వచ్చీరమ్మా ॥

(2) దొడ్డవారే పెద్ద బావగారు
దొడ్డి దోవన తిరిగొచ్చినారు !
మడ్డి బావలు ఎడ్డి మరదులు
దొడ్డ కబురులు చెప్పుకొనుచు !

॥ వచ్చీరమ్మా ॥

(3) ఎడ్డి మడ్డి తనాలతోను
దొడ్డి నిండా కొలువు దీర ॥
జారీ చెంబులు నేసియబోతె
సారా ముంతలు తెచ్చీయమనిరి ।

॥ వచ్చీరమ్మా ॥

(4) గారవంబున మాటలాడిన ।
నోరుతెరచుకు ఊరకుందురు !
పాడు కూతలు కూయుచును మా
గౌరవమ్ములు కొల్లగొట్టుచు !

॥ వచ్చీరమ్మా ॥

# వియ్యాల వారిని వెటకారం

## ఏదేశాన్నుంచొచ్చారయ్యా మాదేశానికి

### హరికాంభోజి స్వరాలు — ఆదితాళం

గ ప మ గ - రి స సా । ధ̣ా ని̣ స ధ̣ ని̣ ధ̣ా
ఏ - దే - శా న్నుం చొ చ్చా - ర - య్యా
ధ̣ స స రి - గా , మ । గా , , - , , గ మ
మా - దే - శా ని కి —— —— మా
పా పా - , , పా । ప ద ని ద - ద ప మ గ
చ క్కా —— ని శ్రీ - ర ఘు సుం ద రి
గా గ గ - సా , రి । గ ప మ గ - సా రీ ॥
మక్కువ తీ - ర గా —— —— ॥

### పాట

(1) ఏ దేశాన్నుం చొచ్చారయ్యా
మా దేశానికి —. మా
చక్కాని శ్రీరఘుసుందరి
మక్కువ దీరగా
॥ ఏదేశాన్నుంచొచ్చారయ్యా ॥

(2) బియ్యే ఎమ్మే చదివాడాని
మీ వార్ చెప్పిరి – ఇంత
ఓనమాలు రానివాడని
ఎరక్క పోతిమి
॥ ఏదేశాన్నుంచొచ్చారయ్యా ॥

(3) చీరలు సొమ్ములు పెడతారని
మీ వార్ చెప్పిరి — ఇంత
నార గుడ్డలు పెడతారని
ఎరక్క పోతిమి

॥ ఏదేశాన్నుంచొచ్చారయ్యా ॥

(4) మేడలు మిద్దెలు కలవారని
మీవార్ చెప్పిరి — ఇంత
గోడల్లేని పూరిళ్లాని
ఎరక్క పోతిమి

॥ ఏదేశాన్నుంచొచ్చారయ్యా ॥

(5) రవ్వల్ ముత్యాల్ తెస్తారని
మీవార్ చెప్పిరి — ఇంత
పుస్తె బొందులు ఇస్తారని
ఎరక్క పోతిమి

॥ ఏదేశాన్నుంచొచ్చారయ్యా ॥

# వియ్యాల వారి నెగతాళి
## మనకెక్కడ దొరికినారే

**కాంభోజిరాగం — ఆదితాళం**

। ; ; ; ప ద ,
మ న

సా , పా , మా గ గా సా , రి గ ।
కె క్క డ దొ రి కీ నా -

సా ; , , । ; ; ; స ద
రే ——— ——— బ ల్

స రి మా , గా , మా , పా , పా ।
ట - క్క రు ల బ్బ బ్బ

ద రి సా , నీ ద । ని దా ప మా ప ద ॥
త గ నీ వి - । య్యా - ల వా - - ॥ రెక్కడ

(1) , ; దా , స రి గ గా సా , రీ ।
మా టలు బ హు తే ట ।

రి ప మా , మ గ రి । రీ , గ సా , స ।
మ - న్న — న । లూ - రుూ ట

; ప ద రి స స ని ని ద దా మా పా ।
బై - టా - డం బ ర మే కా ని

ద, సా పా , మ గ । మ గ మా , ప మాపా ॥
పై - నా లే - । దా - టా ——— ॥

పాట

మన
కెక్కడ దొరికి నారే బల్
టక్కరు లబ్బబ్బ తగని వియ్యాల వా
॥ రెక్కడ ॥

(1) మాటలు బహుతేట । మన్ననలు ఝూట
బైటాడంబరమె కాని । పైసాలేదట
॥ ఎక్కడ ॥

(2) వెండి జల్తారు చీరలు । వెలపెట్టి తేలేక
మొండి మూరెడు నెరవు । మోటు చీరలు తెచ్చిరి
॥ ఎక్కడ ॥

(3) పరువు జూతమంటె । పల్లకైనా లేదు
కొరగాని సహాయము । కోరి ఎక్కిరీ
॥ ఎక్కడ ॥

(4) ఎన్నో ఆభరణములు । కన్యాకిడుదుమని
సున్న చుట్టిరి కద । చోద్యమొందగ
॥ ఎక్కడ ॥

(5) ధరణీలో తిరుమల । దాసుని బ్రోచిన
వరవేణు గోపాలు । డౌనగూర్చెగాన
॥ ఎక్కడ ॥

# వియ్యపురాల ఓ వయ్యారిలోల

కాపిరాగస్వరాలు — త్రిశ్రం

| | | | |
|---|---|---|---|
| నీ నీ నీ | నీ నీ దా | సా సా సా | సా సా , రి |
| వి య్య పు | రా ల ఓ | వ య్యా రి | లో ల నీ |
| సా నీ దా | ప మ ప స ని ద | పా , , | ; , , |
| వ య్యా ర | ము - లెం దు - | కే — | ——— |
| రీ రీ గా | మా పా పా | మా పా , మ | గ రి సా , స |
| క య్యా ల | మా రి ఓ | గ య్యా ళి | గం పా నీ |
| స గ రీ గా | మ మ గా రీ | సా , , | , , ; |
| క య్యం బు | ఇ క బా లు | నే —— | —— |

## పాట

(1) వియ్యపురాల ఓ వయ్యారిలోల – నీ
వయ్యారము లెందుకే
కయ్యాలమారి ఓ గయ్యాళిగంపా – నీ
కయ్యంబు ఇక బాలునే

॥ వియ్యపు ॥

(2) పానకపు బిందెలు, పలుదోము పుల్లలు,
పడతీరో మే మంపితే,
ఒళ్లు సొగసే కాని, పళ్లైన దోమవు – నీ
వయ్యారము లెందుకే

॥ వియ్యపు ॥

(3) పట్టు బనారసు చీరలు పంపిస్తే
పణతిరో నీ కోసమై
చుట్టుచెంగావి చీరలు తెమ్మని
జటిలు పెటెదవే

॥ వియ్యపు ॥

# వియ్యపురాలి మీద పాట

**మధ్యమావతిరాగం — ఆదితాళం**

(1) ని స రి ప - ప మ మ రి - రి స స స - సా స స
వి వ రా - మె రు గ ని - వి - య్యపు - రా లి కి
స రి రి స - స ని ని స - రీ , , - రీ రి రి
వి డి దె లు - చూ - పి తి - మీ — - హె చ్చగ
రి మ మ రి - రి స స స - సా , , - , , , , ॥
వి డి దె లు - చూ - పి తి - మీ — - —— ॥
ప రి రీ - - రి రి రి స - సా స ని - ని ప పా
వి వ రా - - మె రు గ ని - వి య్య పు - రా - లు
ప ని ప మ - మా మ ప - - నీ , , - పా ప మ
వి డి దె లో - నుం డ దు - గా — - హె చ్చ గ
రి మ రి స - నీ ని స - రీ , , - , , , , ॥
వి డి దె లో - నుం డ దు - గా — - —— ॥

పాట

(1) వివరా మెరుగని వియ్యపురాలికి
విడిదెలు చూపితిమీ, హెచ్చగ
విడిదెలు చూపితిమీ ॥
వివరా మెరుగని వియ్యపురాలు
విడిదెలో నుండదుగా, హెచ్చగ
విడిదెలో నుండదుగా

॥ వివరామెరుగని ॥

(2) పలుదోము పుడక, పన్నీరుబుడ్డి,
విడిదెకు పంపితిమీ, హెచ్చుగ
విడిదెకు పంపితిమీ
పొరపళ్ల వియ్యపురాలు
పళ్లేతోమదుగా, హెచ్చుగ
మొగమే కడగదుగా

॥ వివరామెరుగని ॥

(3) అగరునూనె, దంతపు దువ్వెన,
విడిదెకు పంపితిమీ, హెచ్చుగ
విడిదెకు పంపితిమీ,
తట్టతల వియ్యపురాలు
తలే దువ్వదుగా, హెచ్చుగ
సిగే చుట్టదుగా

॥ వివరామెరుగని ॥

(5) అత్తరు సీసా, సబ్బు బిళ్లా,
విడిదెకు పంపితిమీ, హెచ్చుగ
విడిదెకు పంపితిమీ
అబ్బబ్బా యీ వాసన మాకు
అలవాట్లేదనిరీ, హెచ్చుగ
అలవాట్లేదనిరీ

॥ వివరామెరుగని ॥

(5) కాటుక కాయ, కుంకుమబరిణె,
విడిదెకు పంపితిమీ, హెచ్చుగ
విడిదెకు పంపితిమీ,
ఏనుగు కళ్ల వియ్యపురాలు
కాటిక తీర్చదుగా, హెచ్చుగ
బొట్టే పెట్టదుగా

॥ వివరామెరుగని ॥

(6) కాఫీ ఉప్మా ఇడ్లీ పూరీ
విడిదెకు పంపితిమీ, హెచ్చుగ
విడిదెకు పంపితిమీ,

అబ్బబ్బా యీ కారము మాకు
అలవాట్లేదనిరీ, హెచ్చుగ
అలవాట్లేదనిరీ

॥ వివరామెరుగని ॥

(7) బనారస్ చీర, మొఖముల్ రవిక
విడిదెకు పంపితిమీ, హెచ్చుగ
విడిదెకు పంపితిమీ,
చింకిరి చీరా వియ్యపురాలు
చీరే కట్టదుగా, హెచ్చుగ
రవికే తొడగదుగా

॥ వివరామెరుగని ॥

# వియ్యపురాలొచ్చె

## బిళహరిరాగం — మిశ్రచాపు తాళం

ద సా , ని - దా పా । మా గ - రి గ మ గ
వి — — య్య పు రా - లొ - చ్చె -
సా , - ; ; । , , - ; , ॥
నూ —— —— —— ॥
గ గ గ - ప ప పా । గా గ - పా దా
వి స రు కొ ను చూ వ ద్ద న కు
ద దా - గా రీ । స స ని - ద ప దా
అ టూ ఇ టూ తి రు గు చూ —
స స ని - దా పా । ప ద ప - మ గ ప ద ॥
అ క్క - ల్లే ని మా - ట లా - డు ను ॥

(1) గా గ - ప ప దా । సా స - సా ,
ఆ మె అ ప్పా - ఉ న్న దీ
స రి గ - సా స ని । ద ద ప - దా దా
అ o త క న్నా - అ o ద గ త్తె
ద దా - గ గా రి । సా ని - ద ప దా
ప కా ప కా - న వ్వు చూ —
సా ని - ద ద పా । మా గ - పా ప ద ॥
ప ళ్లు ప యి కీ పె ట్టు చూ — ॥

## పాట

పల్లవి
వియ్యపురా లొచ్చేనూ
విసరు కొనుచు వడ్డనకు
॥ వియ్యపు ॥

అనుపల్లవి
అటూ ఇటూ తిరుగుచూ
అక్కర్లేని మాటలాడుచు
॥ వియ్యపు ॥

చరణం (1) అమె అప్పా ఉన్నదీ
అంతకన్నా అందగత్తె,
పకా పకా నవ్వుచూ
పళ్లు పయికి పెట్టుచూ
॥ వియ్యపు ॥

(2) ఆటకత్తె కూతురూ,
పాట కత్తె చెల్లెలూ,
అటూ ఇటూ తిరుగుచూ
హడావిడి చేయుచు ॥
॥ వియ్యపు ॥

(3) అమె అన్నదమ్ములు
అర్గురార్గురు వచ్చిరి,
అటూ ఇటూ జూచి అర
చేత స్వర్గము చూపుచు
॥ వియ్యపు ॥

(4) రమణులందరు వండిరీ
లడ్డూ, హల్వా పేణియల్,
కుంటి వదినగారు మహా
కొసరి కొసరి వడ్డించిరీ
॥ వియ్యపు ॥

# మగపెళ్లివారు పెళ్లికూతుర్ని వేళాకోళం

## నీకుతగిన నెలతకాదు నీరజాక్షుడా

జంఝూటి రాగం — రూపకతాళం

రి మ గ రి - స స సా । ద స ని ద - ద ద పా
నీ - కు - త గి న నె ల త - కా - దు

, ధ స రి గ మ ప మ । గా ; , ॥
- నీ ర జా —— క్షు డా — ॥

గ మ పా పా పా । ప ద ని ద ద ప మ గ మా
ఏ వ రు కో రి చే - సి - నా —— రో

, మ గ గ రి సా రి । గా ; ; ॥
- ఏ మి సే — తు రా — ॥

### పాట

(1) నీకు తగిన నెలత కాదు
నీరజాక్షుడా ॥
ఎవరుకోరి చేసినారో,
ఏమిసేతురా

॥ నీకు తగిన ॥

(2) ఇంటిపనులు చేసి వంట
వండునో లేదో ?
బుద్ధిచెప్పి దాని నీవు
బుజ్జగించరా

॥ నీకు తగిన ॥

(3) ఈడు కూడ ఎక్కువాయె
ఇంతికి నీకునూ,
దైవఘటన చేత నీకు
తరుణి ఆయెరా

॥ నీకు తగిన ॥

(4) భర్త పోషణ చేయమంటె
పలుక దేమిరా ?
పణతివల్ల మనకు ఇపుడు
పరువు హీనమూ

॥ నీకు తగిన ॥

(5) తోటికోడలితో జగడమాడి
కూడియుండురా,
కోపమునకు కొదువలేదు
భామకెప్పుడూ

॥ నీకు తగిన ॥

(6) అత్తమామల ఆడబిడ్డల
భయములేదురా,
బావగార్ల ఎదుట ఎపుడు
పలుకుచుండురా

॥ నీకు తగిన ॥

(7) మంకుతనము మానమంటే
మానదేమిరా ?
మదన గోపాల వేగనీవు
మందలించరా

॥ నీకు తగిన ॥

(8) గొప్పవారి బిడ్డనని
గోటుచెందురా,
వేగదాని గర్వమణచి
ఏలుకోవేరా

॥ నీకు తగిన ॥

# అత్తగారికి సలహా

## అత్తగారవమ్మా అరడిసేయకమ్మా

జంఝూటి — మిశ్రచాపు

, , , - ; స స

అ -

స సా - స ని రి స । స ని ని - ధా ధ ని

త్త గా రా —— వ — మ్మా అ -

స రీ - రి గ మా ప మ । గ రి మ గ గా - గ రి రీ సా

ర డీ శే - యా - క - ——— మ్మా - వ

గ గా - గ మ పా ద ప । మ గ గా గ మ - మా ద ని

త్తు లూ వ - త్తా — క - ——— మ్మా - ఒ

స రీ - రి గ మా ప మ । గ రి మ గ గా - గ రి రీ స స ॥

త్తి గి లు ం డా —— వ - ——— మ్మా - అ - ॥

### పాట

(1) అత్తగార వమ్మా
ఆరడి శేయకమ్మా
ఒత్తిగి లుండావమ్మా
వత్తులూ వత్తకమ్మా ॥ అత్త ॥

(2) కొడుకును కన్నానని
కోమలి పొంగకమ్మ
కొడుకును కన్నవార్కి
గోడపంచలే సుమ్మా ॥ అత్త ॥

(3) అత్తగార్లు కూడ
వెనుక కోడళ్లే నమ్మా
జ్ఞప్తికి తెచ్చుకుంటె
జ్ఞానము వచ్చునమ్మ ॥ అత్త ॥

(4) నీవలెనె నేనూ వస్తి
నిజముగ నమ్మవమ్మ
కొడుకుతొ చెప్పకమ్మ
కోడరిక ముంచకమ్మ ॥ అత్త ॥

(5) సరిసరి అత్తగారా
పడిపడి దండాలమ్మా
సరిదప్పుతేను నీకు
పిడికిడి అన్నామమ్మా ॥ అత్త ॥

# అప్పగింతల పాటలు

## సీతమ్మ మీ అత్తవారింటికేగి

### పీల్ రాగస్వరాలు — మిశ్రచాపు

, సా - సా సా । ని̣ స రి మ గా - రీ రి మ గా
సీ త మ్మ మీ ——— అ త్తా ———
రి సా - రీ , మ గ రి । సా రి గ రీ - సా స ని నీ̣
వా - రిం ——— టి కే ——— గి ———
; స - సా సా రి స । ని స ని̣ - ద ఫ̣ ద ప మా̣
భూ త ల —— మం - దు - న ——
, పా - నీ నీ । ని̣ సా - రీ , మ గ రి
ఖ్యా తి చెం - దా వ —— ——
రి గ సా , - ; ; । , , - , , ॥
మ్మా —— —— ——— ——— ॥

పాట

(1) సీతమ్మ మీ అత్త
వారింటికేగి
భూతల మందున
ఖ్యాతి చెందవమ్మ

॥ సీతమ్మ ॥

(2) అత్తమామల యెడల
అణకువతో మెలగి
ఉత్తమ సతివని
అనిపించు కొమ్మా

॥ సీతమ్మ ॥

(3) పతిసేవ లనయము
అతి భక్తితో సలిపి
పతి కరుణలంది
పేరొందవమ్మా

■ సీతమ్మ ■

# అప్పగింతల పాట

## "సీతమ్మ మా అత్తవారింటి కేగి" — వలె

### "పీల్" రాగస్వరాలు — మిశ్రచాపుతాళం

(1) పోయిరావే తల్లి పోయిరావమ్మ
పోయి అత్తింటిలో బుద్ధి కలిగుండవమ్మ ॥ పోయిరావే ॥

(2) అత్తమామల తోడ హర్షంబు కలిగి
అణకువతో సంచరించు మాయమ్మా ॥ పోయిరావే ॥

(3) బావమరదుల యందు భయ భక్తి కలిగి
బహు నెమ్మదిగ తిరుగు బాల మా తల్లి ॥ పోయిరావే ॥

(4) తోటి కోడండ్రతో కలత లాడకుమీ
కూరిమి కలిగుండు గుణముగల తల్లీ ॥ పోయిరావే ॥

(5) పతియె దైవము సుమ్మి పణతుల కెల్ల
పతిమాటలకు యెపుడు అడుగు దాటకుము ॥ పోయిరావే ॥

(6) పతి నిన్ను పిలిచి కోపము చేసిన గాని,
పతి కెదురు మాట్లాడి పలుకకే తల్లి ॥ పోయిరావే ॥

(7) అంతరంగమందు పతి యన్నమాట
ఎంతైన హితులకు యెరిగింపకమ్మ ॥ పోయిరావే ॥

(8) అత్త యింటికి పోయి వత్తువా యమ్మ?
చిత్తమందున భీతి చెందకుమమ్మా ॥ పోయిరావే ॥

(9) అమ్మరో నిను బంపి యెట్లుందుమమ్మా
కన్నీరు తుడుచుకో కనకంపు బొమ్మా ॥ పోయిరావే ॥

# అప్పగింతల పాట

## సుకుమారి నెటు జూతువా

**కాంభోజిరాగం — ఆదితాళం**

ప ద ॥

సు కు

సా , పా , మా గ గా సా , రి గ

మా రీ నె టు జూ - తు -

సా ; ; ; ; ; ; స ధ

వో —— ——— ఇ ది

స రీ మా , గా మా , ప పా , ప

సు మ శ రు ని - చే తి

ద రి సా ; ని ద ని దా ప మా ప ద ॥

ప్ర - సూ న పు —— హొూ తి ॥

(1) , , దా స రీ గా గా సా , రి

పూ లు గో య గ చె య్యి

; రి ప మ గ గ రి రీ సా రీ సా

పొ - క్కు మా —— య - మ్మ కు

; ప ద రి స స ని ని దా ద మా పా ॥

మే - లా - ల తో —— గా - త్రి ॥

ద సా పా , మ గ మ గ మా , ప మా పా

మీ - తో న - చే - రే —— ——

## పాట

సుకుమారి నెటు జూతువో - ఇది
సుమశరుని చేతి
ప్రసూనపు హెూతి ॥ సుకుమారి ॥

(1) పూలు గోయగ చెయ్యి
పొక్కు మాయమ్మాకు,
మేలాలతో గాత్రి
మిాతోన జేరె ॥ సుకుమారి ॥

(2) పన్నీరు నించుమన్న
పరితాపము జేయు
కన్నెల మిన్న
చక్కని ముద్దుగుమ్మ ॥ సుకుమారి ॥

(3) చిలుకకు పద్దెము
చెప్పిన శ్రమనొందు
అలి నీలవేణి
అంబుజ పాణి ॥ సుకుమారి ॥

(4) ధరణిలో తిరుమల
దాసుని బ్రోచిన
వరవేణు గోపాలు
కరుణా గోరుచు ॥ సుకుమారి ॥

# అప్పగింతల పాట

## సకల గుణసుధామ

### కమాచ్‌రాగం — త్రిశ్రగతి ఆదితాళం

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప | ద | రి | - | స | స | ని | - | దా | ప | | | - | మ | గ | మ |
| స | క | ల | | గు | ణ | సు | | ధా | మ | | | | నీ | - | దు |
| ప | ప | ప | - | దా | ని | - | - | సా | ని | రి | సా | - | సా | , | |
| స | ఖి | శి | | రో | మ | | | ణి | ——— | | | | న్ | | |
| ద | ద | ని | - | సా | రి | | - | గా | రి | | | - | సా | రి | |
| వి | క | సి | | తా | బ్జ | | | నే | త్రి | | | | నె | ట్లు | |
| గ | ప | మ | - | గా | రి | | | సా | , | | | | , | ; | ॥ |
| ప్రే | - | మ | | జూ | చె | | | దో | | | | | —— | | ॥ |

### పాట

(1) సకలగుణ సుధామ నీదు
సఖిశిరోమణిన్
వికసితాబ్జ నేత్రి నెట్లు
ప్రేమ జూచెదో ॥ సకల ॥

(2) సొబగు లొల్కు మోము ఎండ
చూడనోపునో – ఆ
బాల సుకుమారి నింక
ఎటు భరించెదో ॥ సకల ॥

(3) నిరతము ఆ తమ్మిపనుల
కందుచుండెడిన్
తప్పులున్న క్షమియించి
బ్రోవతగునయా ! ॥ సకల ॥

(4) ధర తిరుమలసూరి వేడు
దైవరాయునిన్
వరపదాబ్జ మాన మాడు
బాల బ్రోవుమా ॥ సకల ॥

# అప్పగింతల పాట

## అప్పాగింపెద మమ్మా

### ముఖారి రాగం - మిశ్రచాపు తాళం

(1) ; ప ద - సా సా । ద స ని - ద మ మా
అ - ప్పా గిం బె దె - మ - మ్మా
; ప ద - ద స నీ నిదపా । పా ద స నీ - ని ద పా పా
ఒ పూ్ప - లా - కు ప్పా - ని పు డూ -
; మ మ - పా ద ప । మ గ రీ , - రి గ సా
ఆ - మ్మారో - మా — యు- మ్మా
స రిమ - పా పా । ప ద మ - పా పా
ని నూ - క న్న భా - గ్య మే దె
; ప ద ప ద సా । , , , - , , ని ద
త - ల్లీ — — — —
, పాదని - ద నీ , । పా , - , , , , ॥
— — — — ॥

(2) ; ప ద స రి మ గ రీ రీ । రి రి రి - రి గ రి గ రీ
తొ- మ్మి - — ది నె ల లు మో- సీ - -
; స స - రి మ గ రి సా । ద ని ప దా - సా సా
ని ను కం — టి నో — యు మ్మా ॥
; ప రి - రి స సా । ద స ని - ని ద ద ప
ప - ణ్ణె ం డూ ఏ - ళ్లు పె ం చీ -
ప ప ద - ప మ మా । ప ద ని - ద ప పా
ప తి కి ని న్న - ప్పగి ం చె ద ము

(1) అప్పాగించెద మమ్మా
ఒప్పులకుప్పా నిపుడు,
అమ్మారో మాయమ్మ
నినుకన్న భాగ్య మేదె
తల్లీ ॥

(2) తొమ్మిది నెలలు మోసి
నినుకంటి నోయమ్మా,
పన్నెండు ఏళ్లు పెంచి
పతికి నిన్నప్పగించితిమి ॥

చరణం (1) వలె

నలుగుర్లో పన్నెత్తి నవ్వాబోకమ్మా
పొద్దాతె పొరుగడపా ఉండబోకమ్మా
అమ్మారో మాయమ్మ
నినుకన్న భాగ్యమేదె
తలీ.॥

# అత్తవారింటికి అమ్మనినుపంపెద

## ఖరహరప్రియ స్వరాలు — ఆదితాళం

| | | | |
|---|---|---|---|
| ; స రి | సీ సా | , సీ స | రి గ రీ |
| అ త్త | వా రీ | ఇ ం | టి - కీ |
| , రి గ | మా మ స | , రి గ ప | మ గా , రీ |
| అ మ్మ | ని న్నూ- | - ప ం - | పె — దా |
| రి ప | పా పా | పా ప మ | ప ద ప ద నీ |
| ఎ త్తి | యు ర | మున - | చె - లీ — |
| ద ప మ ప | మా మ స | రీ గ ప | మ గా , రీ |
| — ఏ మి | సే తు - | నే —— | బా — లా |

### పాట

(1) అత్తవారింటికి । అమ్మనిన్ను పంపెదా
ఎత్తియురమున చెలీ । ఏమిచేతునే బాలా, ॥ అత్త ॥

(2) ఇన్నిఏళ్లు పెంచి నిను । బహు అన్యాయ మొనర్చి
పరులపాలు చేయుటకు । వరములు వేడితిని ॥ అత్త ॥

(3) బొమ్మరిల్లు కట్టుకొని । బొమ్మలాట లాడుచూను
బిందులు తొక్కేటి । చిన్నతల్లి నెట్లు మరతునె ॥ అత్త ॥

(4) బాలీకామణిరో నిన్ను । బాలునైన చేయక
బాలగా చేసెనె బ్రహ్మ । ఆ బ్రహ్మ నేమందునే ॥ అత్త ॥

# హాస్యపు అప్పగింతలు

## పతివ్రతా ధర్మము బాగుగా సలిపి

### కేదార్‌రాగం — పద్యంలాగ పాడుకోవాలి

(1) మ గ మ పా ,మ - గ రి సా స ని పా
ప తి వ్ర తా - ధ - ర్మ — మ్ము
ప స స సా , గ మ పా , మ
బా - గు గా స లి పీ —
గ మ గ రి స సా ని ధ నీప
ఈ —— —— ——
ప స స స ప ప ప మ గ మ గ రి స
అ త ని చె ం ప మీ —— — ద
స స రి గా స । సా సా , , ॥
అం టి సూ — ఉండూ — ॥

పాట

(1) పతివ్రతాధర్మమ్ము బాగుగా సలిపి
అతని చెంపమీద అంటిస్తూ వుండు ॥

(2) మగనితో నీకసలు మైత్రి సరిపడక
పగదానివలె మీాద పడజూడె తల్లీ ॥

(3) అత్తమామలతోటి అనువుగాకుంటే
క్రొ త ముగ్గులు పెట్టి కుంగదియ్యవే ॥

(4) సేవ చేయించుకో చిన్నత్త చేత
బావగారిని నీదు బానిసగా చూడు ॥

(5) మరదుల నట్టిట్టు మన్నించబోకు
ఇరుగు పొరుగులతోటి ఇచ్చకములాడు ॥

(6) అంపకముల నాడు అడగ వచ్చితే
కొంపకదలక కోపించుకోవే ॥

(7) పెద్దలు నిన్నొచ్చి పిలవ జూచితె
పెద్దపెట్టున గోలపెట్టి ఆటాడె ॥

(8) ఏకువలె మెత్తంగ నెరుగనట్టుండి
మేకు రీతిని బిగిసి మేలుకొనీయుండు ॥

(9) కయ్యంబులకు ముందు కాలుదువ్వుచును
పొయ్యికడకే పోక బుద్ధిగలిగుండు ॥

(10) అంకిన కాడికి అమరజూచుకుని
జంకుచెందక బారజాచి పోరాడే

# వెటకారపు అప్పగింతలు — పద్యం

## — "పతివ్రతాధర్మము" — వలె

### కేదార రాగం

(1) పతివ్రతా ధర్మమ్ము
పాటించుకోవే
పతిచేత నీ కాళ్లు
పట్టించుకోవే! ॥

(2) మొగుడు నీతోవచ్చి
ముచ్చట లాడితే
పగదానివలె మీద
పడిపోవె తల్లీ!

(3) తమల పాకుచ్చుకు
తానొక్కటంటే
తలుపు చెక్కుచ్చుకు
తలమీద కొట్టు! ॥

(4) ఇరుగు పొరుగువారు
నిన్నేమ నంటే
ఇంటికి ఓచ్చెట్టి
లేచి రావమ్మ! ॥

# అప్పగింతల పాట

## మాయమ్మా లక్ష్మీదేవి పోయిరావమ్మా

**సావేరిరాగం — మిశ్రచాపుతాళం**

(1) , స స రీ ప ప మ ప । ప పా, ప ద ద ప మా
మా - య —— మ్మ ల క్ష్మీ దే - వీ ——

; మ పా, ద ద ప మా । గా రి - రి స సా
పో యీ - రా —— వ - మ్మా ——

; స రి గా , రి స । సా , స ధా ప ద
పో యీ నీ - అ త్తిం - ట -

; స రి మ మా । పా ప ద మ - పా ; ॥
బు ద్ధి - గా ను ం — డూ - ॥

; ప ద ప మా ప ద । సా , స రి సా స రి సా
ఎ వ్వ —— రే - మా డీ —— నా ——

; స స స రిఀ గా రి రి । సా , స ని దా ప ద
ఎ దు రా ——— డ క మ్మా ——

; ప ప ద రి స స । స సా - ని ద ప ద
వీ - ధీ - ని - ని లు - చు ం డీ -

స సా - స ని దా పా । మ పా ద ప మ - గ రి సా ॥
త ల వి —— ప్పి ము - డు —— వ కుమీ ॥

## పాట

(1) మాయమ్మా లక్ష్మీదేవి
పోయిరావమ్మా
పోయి నీఅత్తింట
బుద్ధిగానుండు ;
ఎవ్వరేమాడిన
ఎదురాడకమ్మా
వీధీ నిలుచుండీ
తలవిప్పి ముడువకుమీ ॥

(2) మాట లెన్నన్నాను
మాటాడకమ్మ
పలుమారు మామీద
ప్రేమాలుంచకు మా
ఆకలున్నా గాని
అన్న మడగబోకు
మాటకు పదహారు
నాటకుడ్డతను

## పెళ్లికూతురు జవాబు

(3) బొమ్మరిల్లున్నాయి
బొమ్మలున్నాయి ।
నేను ఆడేడి
సాలాలున్నాయి
నామారుగా మీరు
ఆడుకోరమ్మా ।
పోయినా అత్తింటికి పోయి వసాను
దీవించు అన్నల్లు, దీవించు అక్కా

# పల్లెటూరి హాస్యం

## పెల్లిపెల్లన్నాడు ఫెల్లుమన్నాది

**హరికాంభోజి స్వరాలు — ఝంపెతాళం**

సా రి[2] రి మ - మా[1] మా మ

పె ల్లి పె - ల్ల న్నా డు

గా[2] మ గ రి - రి స సా ,

పె ల్లు మ - న్నా - దీ

నీ[1] సా రి - రి రి గ రి స

పె ళ్లై న తె - ల్లా - రి

ని స సా స - సా సా , ॥

స గ్గి బ - గ్గో లా

### తాళం లేకుండా

ని̣ ని̣ , స రీ , రి రీ గ[1] రి స నీ̣

గౌ రి క ల్యా - ణా ———

నీ̣ స రి గ[1] రి రి స సా

లై భో - గ - మే ——

సా సా , రి మా , మ గా[2] మ గ[2] రి సా

అ చ్చిం క ల్యా —— ణా ———

సా రి గ[2] మ గ గ[2] రి రీ ॥

సౌ భా - గ్య - మే —— ॥

## పాట

(1) పెల్లి పెల్లన్నాడు
పెల్లు మన్నాది ।
పెల్లైన తెల్లారి
సగ్గి బగ్గోలా ॥

(2) గౌరికళ్యాణ వైభోగమే
లచ్చిం కళ్యాణ సౌభాగ్యమే ॥

(3) నీ సా రి, - రి రి గ రి స
క న్న మ్మ బా సి కా - లు
ని స స సా-- సా సా,
క ద ల మ న్నాడే

మిగిలిన చరణాలు (1), (2) లాగ పాడుకోవాలి

(2) వోలేది వంకేది
ఓపెళ్లి కొడకా
వడికట్టు బియ్యమేయి
ఓపెళ్లి కొడకా ॥

గౌరికల్యాణా వైభోగమే
లచ్చిం కల్యాణా సౌభాగ్యమే ॥

(3) మా బాబు గెడ్డాము
బైరి గెడ్డాము
ఈ నుండె పేనుండె
ఈతముల్లుండె ॥

గౌరికల్యాణా వైభోగమే
లచ్చిం కల్యాణా సౌభాగ్యమే

(4) ఊరిపోయె నీళ్లోయ్
పసుపు తోట్లోకి
పారిపోయె మల్లోయ్
ఉల్లి తోట్లోకి ॥

గౌరికళ్యాణా వైభోగమే
లచ్చింకళ్యాణా సౌభాగ్యమే ॥

(5) నువ్వుతిన్న ఇత్తట్లో
మందిన్న ఇత్తట్లో
మత్తుంగ ఉండాయి ఒకేలాగి
మత్తుగల పెళ్లికొడక
ఎత్తెయ్యరాదా ॥

గౌరికళ్యాణా వైభోగమే
లచ్చింకళ్యాణా సౌభాగ్యమే ॥

(6) అలివేలు కుండలకి
అంచులే లేవా
పెళ్లికొడుకు అబ్బాయికి
పెదిమలే లేవా ॥

గౌరికళ్యాణా వైభోగమే
లచ్చింకళ్యాణా సౌభాగ్యమే ॥

(7) కల్యాణం గొట్టంగ
గొంతెండి పోయె
గతిలేని పెళ్లికొడక
గంజెత్కు రారా ॥

గౌరికళ్యాణా వైభోగమే
లచ్చింకళ్యాణా సౌభాగ్యమే ॥

(8) భంగోడి సెట్టుకింద
భాసికాలు వేయంగ
గన్నేరు సెట్టుకింద
కంకణా లిప్పంగ ॥

గౌరికళ్యాణా వైభోగమే
లచ్చింకళ్యాణా సౌభాగ్యమే ॥

(9) పెళ్లికూతురు తల్లెమ్మ
పేద ముత్రాలు
సనిమకలు గూదేసి
సన్నాలు పట్టంగ ॥

గౌరికళ్యాణా వైభోగమే
లచ్చింకళ్యాణా సౌభాగ్యమే ॥

# సేతకంకణం గట్టి

"పెల్లిపెల్లన్నాడు ఫెల్లుమన్నాది" — లాగ

**హరికాంభోజి స్వరాలు — ఝంపెతాళం**

సేత కంకణం గట్టి, సీత పెళ్లాడ
సైయెత్తి దణ్ణాలు బావకు పెట్టాల
గౌరికళ్యాణా వైభోగమే ॥

కల్యాణం పాడంగ గొంతెండిపాయ
గతిలేని పెళ్లికొడక గంజెత్కురార
గౌరికళ్యాణా వైభోగమే ॥

చిన్నచిన్న బుడ్లు షీకాయ బుడ్లు
అపరాశి పెళ్లికొడక జలకమాడంగ
గౌరికళ్యాణా వైభోగమే ॥

చిట్టెలుక నట్టెలుక బొక్కతోడింది
ఎల్లిర తిమ్మన ఎలిక సచ్చింది
గౌరికళ్యాణా వైభోగమే ॥

అలివేణి కుండలకి అంచులు లేవు
పెళ్లికొడుకు అచ్చికి పెదిమలు లేవు
గౌరికళ్యాణా వైభోగమే ॥

ఉతికిన గుడ్డల్లు మెత్తనుండాయి
మోజైన మడియాల మూటెత్కురార
గౌరికళ్యాణా వైభోగమే ॥

వంకేది, వోలేది, ఓపెళ్లికొడక
వడికట్టు బియమియిగో ఓపెళ్లికొడక
గౌరికళ్యాణా వైభోగమే ॥

నలుగులు బెట్టంగ నాటు నిద్దరలు
పాటలే పాడంగ పగలు నిద్దరలు
గౌరికళ్యాణా వైభోగమే ॥

కుండల్లో వీబూది గుప్పటిల్లంగ
గుంటూరు వీరయ్య నీవరకు వస్తాడు
గౌరికళ్యాణా వైభోగమే ॥

# కొట్నాలు దంచుట

## సువ్వి సువ్వి రామచంద్ర

### శంకరాభరణ స్వరాలు — త్రిశ్రం

| | | | |
|---|---|---|---|
| సా రి | సా ని | దా ద | సా స |
| సు వ్వి | సు వ్వి | రా మ | చం ద్ర |
| సా రి | గా మ | గా రి | సా స |
| సు వ్వి | సు వ్వి | కీ ర్తి | సాం ద్ర |
| స స రి | సా ని | దా ద | ప ప ప |
| సు - వ్వి | సీ - | త మ్మ | మా - కు |
| ద ధ ని | సా రి | సా , | , , , |

### పాట

(1) సువ్వి సువ్వి రామచంద్ర
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వి సీతమ్మ.మాకు
శుభము లిమ్మా ॥

(2) మోదమున పెండ్లిపీట మీద శ్రీరాము సరస,
ఆదిలక్ష్మియైన సీతమ్మను నిల్పిరీ ॥ సువ్వి సువి

(3) వాటమైన కుందనంపు మేటికుందె యందు నిల్పి
గాటమైన పసిడి రోకళు బట్టుక ॥ సువ్వి సువ్వి ॥

(4) రాజనము, యిప్పపువ్వు, రాజనములు, మంచిపునుగు,
మేలుకొండ రాజనములు, మేలువంకెలూ ॥ సువ్వి సువ్వి ॥

(5) కుందియందు నిండానుంచి, కొట్నములు దంచిరపుడు
కుందరదన లెల్ల నవ్వుకొనుచు వెలగుచు ॥ సువ్వి సువ్వి ॥

# అత్తపేరు అటుకులచాటు

## రాగమాలిక — వకుళాభరణం — కమాచ్

### చతురశ్రం, త్రిశ్రం

స మ గ మ - ప ప ద ద ప ప
అ త్త పే రు అ టు కు ల చా టు
ప ప ని ద మ - ప ద ప ప
మా మ - పే రు మంచంకో డు
స మ గ మ - గ గ మ మ గ గ మా
నా - పే రు చి ల క ల కొలికి
ప ప ద ద ప ప మా - గా మ గ రి స
పెళ్లికొ డు కు పే - రు లొ ల్లం భొ టు
స ద ప మ - గ రి స రి
అం ద మై న బా వ గా రి్క
గ మ గ రి - సా ; ॥
జ య మంగ ళం - ॥

### కమాచ్ — త్రిశ్రం

గా మ - పా ద - సా ని - ద ద మ
బో సి మూ తి పె ళ్లి కొ డు కు
పా ద - ప మ మ గ - గ రి గ - మా,
మే ల్ బ ం - తు లా - డె నే
స మ గ - గ రి గ - మా గ - రి సా
ఎ గ సి బ ం తు లా డె నే -
స మ గ - గ రి గ - మా గ - రి సా ॥
పూ — బ ం తు లా డె నే ॥

## పాట

### వకుళాభరణం — చతురశ్రం

(1) అత్తపేరు అటుకుల బాట
మామపేరు మంచం కోడు
నాపేరు చిలకల కొలికి
పెళ్లికొడుకు పేరు లొల్లం భొటు
అందమైన బావగార్కి
జయమంగళం ॥

(2) వంటా ఇంటి గోడాకింద
కుక్కకు రెండు పిల్లలు పుడితె
మరిది పుట్టెనంచు నేను
మరీ మరీ సంబర పడితె
అందమైన మరిది గారికి
జయమంగళం ॥

### కమాచ్ — త్రిశ్రం

బోసిమూతి పెళ్లికొడుకు
మేల్‌బంతు లాడెనే
ఎగసి బంతు లాడెనే·
పూ బంతులాడెనే ॥

# హాస్యపు మంగళహారతి

## జయమంగళం నిత్య శుభమంగళం

### ఆనందభైరవి — ఝంపెతాళం, ఆదితాళం

ఝంపెతాళం

స ప ప ద ప - మ గ రి స
జ య మం గ ళం ని త్య
ని స రి గ రి - సా ; , ॥
శు భ మం గ ళం — ॥
; ; , — ; స పా
॥ జయా జయమంగళం ॥

ఆదితాళం

సా పా - పా ప మ । గా రీ సా ;
వా రు వే చి న మం గ లం
నీ సా రీ స స । సా సా సా ;
వీ రు వే చి న మం గ లం
మ మ మా - మా మ మ । గ మ ప మ గా రీ
పె స లు వే చి న మం గ - లం
మ గ మా - పా పా ; । పా ; - ; ;
పె ర ట బె —— ట్టీ ————

ఝంపెతాళం

సా ప పా - పా ద ద ప
అ ప్పు డే మా వ ది న్ని

మా ప ద ప - మ గ రి ని ని
ప ప్ప డ గ బో - తే - ను
గ మ పా ద ప - మ గ రి ని ని
ప - ప్పే — లే - ద - న్న
సా గ గ మ - పా , ; ॥
భా గ్య శా - లీ ———

## చరణం 1 జంపెతాళం

స ప ప ద ప - మ గ రీ స
ఆ - చ ం క నో - బి డ్డ
ని స రీ స - సా సా స
ఈ - చంక నో బి డ్డ
మ మ మ మా - ప మ గా రి
క డు పు లో ఓ బి డ్డ
రి గ మ ప మ - పా , ; ॥
క ద లా - డ గా —
సా పా ప - పా ప ద ప
పంది ట్లో మా వ ది న
మా ప ద ప - మ గ రి ని ని
ప ం ది లా కూ - ర్చు ం ది
ప ప ప పా ద ప - మ గ రి ని ని
ప క ప కా — న - వ్వి ం ది
సా గ గ మ - పా , ; ॥
భా గ్య శా - లీ ——— ॥

పాట

ఝంపెతాళం

జయమంగళం నిత్య
శుభమంగళం - జయా
జయమంగళం నిత్య
శుభమంగళం

ఆదితాళం

వారు వేచిన మంగలం
వీరు వేచిన మంగలం
పెసలు వేచిన మంగలం
పెరట బెట్టీ

ఝంపెతాళం

అప్పుడే మావదిన్ని
పప్పుడగ బోతేను
పప్పే లేదన్న
భాగ్యశాలీ ॥ జయమంగళం ॥

చరణం (1) ఝంపెతాళం

(1) ఆ చంక నోబిడ్డ
ఈ చంక నోబిడ్డ
కడుపులో ఓ బిడ్డ
కదలాడగా
పందిట్లో మా వదిన
పందిలా కూర్చుంది
పకపకా నవ్వింది
భాగ్యశాలీ ॥ జయమంగళం ॥

చరణం 2

పూసింది మావదిన
బుర్రలోది మెంతంత,
పెట్టింది మావదిన
పట్టెడు కుంకం,
వేసింది మావదిన
వెలియ శొంటీ ఆకు,
చేసింది మావదిన
నోరెర్రనా ॥ జయమంగళం ॥

చరణం 3

ఆ వీధినో కుక్క
ఈ వీధినో కుక్క
నడివీధినో కుక్క
సల్ల కుక్కా
అన్ని కుక్కల కంటె
కాటుమించిన కుక్క
కొన్నాళ్లు మావదిన
కొంకనక్కా ॥ జయమంగళం ॥

# జయమంగళం నిత్య శుభమంగళం లాగ

ఆనందభైరవి — ఝంపెతాళం

జయమంగళం రామ
శుభమంగళం – జయా
జయమంగళం రామ
శుభమంగళం

## చరణం 1

ఆ సంకన వొాకపిల్ల
ఈ సంకన వొాకపిల్ల
కడుపులో ఒకపిల్ల
కదలాడగా
ఆరు బొాట్లన్నాము
మూడుబొాట్ల ముద్దపప్పు
బాలకే మావదిన
సరితెడ్డు నాకే ॥ జయమంగళం ॥

## చరణం 2

అప్పకొాక పళ్లెం । పప్పుకొాక పళ్లెం
కూరనారలకొాక । గుండుపళ్లేము
అప్పులోడు వచ్చి । సెప్పుతో కొాడుతుంటె
అప్పుడే మాబావ । పప్పు కేడిసెనే ॥ జయమంగళం ॥

## చరణం 3

మంగళం మంగళం
మా బావ నెత్తికీ
మారులో ఉండేటి
ముంబెలుకకీ,
మంగళం మంగళం
మా వదిన కొాప్పుకీ
గుంతలో ఉండేటి
గోంౘ్రు కప్పకీ ॥ జయమంగళం ॥

## చరణం 4

మంగళం మంగళం
మా మామ మూతికీ,
అడవిలో తిరిగేటి
నల్లమూతి కోతికీ,
మంగళం మంగళం
మా వదిన గొంతుకీ,
కుంటలో తిరిగేటి
గుడ్డి కొంగకూ,
జయ మంగళం నిత్య
శుభమంగళం ।
శుభమంగళం రామ
జయ మంగళం॥

# కంచిగిన్నెలోన కలివొత్తు లేసుకొని

ఆనందభైరవి ఝంపెతాళం

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప | ప | ప | ద | ప | - | మ | గ | రీ | స | | |
| క | ం | చి | గి | - | | న్ని | - | లో | న | | |
| ని | స | రి | రి | స | - | సా | స | స | స | | |
| క | లి | వ | - | త్తు | | లే | సు | కొ | ని | | |
| రి | మ | మా | మ | | - | మా | మ | గ | రి | | |
| చూ | - | డం | డి | | | పె | ద్ద | లు | - | | |
| రి | రి | మా | మ | | - | పా | పా | , | | | |
| పై | - | కా | వ | | | లుం | డి | | | | |
| స | ప | ప | పా | | - | ప | ప | పా | ప | | |
| సి | రి | మి | తో | | | బె | న | క | ప్ప | | |
| మ | మ | ప | ద | ప | - | మ | గ | రి | సా | | |
| పి | లు | వొ | - | చ్చి | | నా | - | డు | - | | |
| స | ప | ప | ద | ప | - | మ | గ | రి | ని | ని | |
| అ | ం | ప | ం | డి | | గ | వ | ర | - | మ్మ | |
| స | గ | గా | గ | | - | గ | మ | పా | , | | |
| న | త్త | యి | ం | | | డ్లా | - | కు | | | |
| పా | ప | ద | ప | | - | మ | గ | రి | స | స | |
| మం | గ | ళ | ం | | | మ | ం | గ | ళ | ం | |
| ని | స | రీ | స | | - | స | స | సా | , | | |
| జ | య | మం | గ | | | ళం | ని | త్య | | | |
| ని | స | రీ | స | | - | స | స | సా | ॥ | | |
| శు | భ | మం | గ | | | ళం | —— | | | | |

పాట

(1) కంచి గిన్నిలోన । కలివొత్తు లేసుకుని
చూడండి పెద్దలు । పై కావలుండి
సిరిమితో బెసకప్ప । పిలవొచ్చినాడు
అంపండి గవరమ్మ । నత్త యిండ్లాకు
మంగళం మంగళం । జయ మంగళం నిత్య
శుభమంగళం । ———— ——— ——— ॥

(2) పుట్టినింటికి పోయి । ఏమి తెచ్చితివి
మూడువేలూ పోసి । ముత్యాల పొటుకూ
మావాళ్లు పెదోళ్లు । ఏమి ఇస్తారు
జయమంగళం నిత్య శుభమంగళం

(3) నాలుగువేలూ బోసి । నడుముకూడాబు
మావోళ్లు పేదోళ్లు । ఏమి ఇస్తారు
జయమంగళం నిత్య శుబమంగళం ॥

(4) అయిదువేలూబోసి । అస్తకడియాలు
మావోళ్లపేదోళ్లు । ఏమి ఇస్తారు
జయమంగళం నిత్య శుభమంగళం ॥

(5) ఏడువేలూబోసి । పెట్టెటి చీరలు
మావాళ్లు పేదోళ్లు । ఏమి ఇస్తారు
జయ మంగళం నిత్య శుభమంగళం ॥

(6) ఎనిమిదివేలూ బోసి । తొడిగేటి రైకలు
మావాళ్లు పేదోళ్లు । ఏమి ఇస్తారు
జయ మంగళం నిత్య శుభమంగళం ॥

(7) తొమ్మిదివేలూబోసి । తొడిగేటి బిందెలు
మావాళ్లు పేదోళ్లు । ఏమి ఇస్తారు
జయ మంగళం నిత్య శుభమంగళం ॥

(8) పదివేలూపోసి । పచ్చల్ల పదకములు
మావాండ్లుపేదోళ్లు । ఏమి ఇస్తారు
జయమంగళం నిత్య శుభమంగళం ॥

# జయమంగళం జయా శుభమంగళం

## జయమంగళం నిత్య శుభమంగళం— లాగ

### ఆనందభైరవి — ఝంపెతాళం

జయమంగళం జయా శుభమంగళం - జయా
జయమంగళం జయా శుభమంగళం ॥

అంచన అలివేణి ఆనంద మాడంగ
పంచన అలివేణి పంతమాడు
నిగనిగా మెరిసేటి నిండు పందిట్లోను
నిలిచెనే అలివేణి నిశ్చలంగా
జయమంగళం జయా శుభమంగళం ॥

ఆపాడు మిట్టన పల్లేరు కాయల్లు
ఉద్దిపువ్వుల సెండ్లు పద్దకొండు
ఒకసేత వుంగరం ఒక సేత బొంగరం
ఒకసేత ఉద్దగిరి కంకణాము
జయమంగళం జయా శుభమంగళం

# కల్యాణము చూతము రారమ్మా

## మోహనరాగం — ఆది, మిశ్రచాపు

### ఆదితాళం

| | | | |
|---|---|---|---|
| స రి రి స | సా రి రి | గా ద ప | గ రి రి స |
| క - ల్యా- | - ణ ము | చూ త ము | రా - ర -॥ |
| సా , , | , , దా | ద స సా | ద ప గ రి |
| మ్మా — | — శ్రీ | సీ - తా | రా - ముల |

॥ కల్యాణము ॥

### మిశ్రచాపు

| | | | | |
|---|---|---|---|---|
| చరణం (1) | ద ద ద | దా ద ద | ద ద స | ద ప ప ప |
| | హొయలు | మీ ర గ | త రు ణు | ల ం ద రు |
| | ప ప ద | ద ప గ గ | పా ద | స స సా |
| | బ యలు | దే - రి రి | హా ర | తు ల తో । |
| | ద ద గ | గ రి సా | సా స | ద ప దా |
| | ది శ లు | నిం డె ను | వా ద్య | ర వ ళి |
| | ప ద స | ద ప ప ప | ప ద ప | గ రి సా |
| | మి - న్ను | ము - ట్టె ను | వే - ద | ఘో - ష |

### పాట

కల్యాణము చూతము రారమ్మా -
శ్రీ సీతారాముల కల్యాణము చూతము రారమ్మా।

(1) హొయలు మీరగ తరుణు లందరు
బయలు దేరిరి హారతులతో
దిశలు నిండెను వాద్యరవళి
మిన్ను ముట్టెను వేద ఘోష ॥ కల్యాణము ॥

(2) కుసుమ కోమలి కొమ్మ జానకి,
అసమ శరుని శర పందెపు బొమ్మ
మారటి మారుడె మా శ్రీరాముడు
ఏరు పొగడగల రింత వైభవము ॥ కల్యాణము ॥

# మంగళహారతి

## శ్రీరామ గొను కర్పూరహార తిదిగో

### సింధుభైరవి — ఆదితాళం

, స ప । పా ప ద । ప మ గా । గా మా ।
శ్రీ - । రా మా - । - గొ ను । క ర్పూ
గ మ ప ద । ప మ గ మా గ రి రి । సా , , ॥
రా —— । — హా - ర తి ది । గో — ॥
, నీ । స గ గా । గ స ని । సా గా ।
సీ । తా - దే । - వి కీ । ము త్యా ।
గ మ ప ద । ప మ గ మా గ రి రి । సా , , ॥
లా —— । —— హా - ర తి ది । గో — ॥

చరణం ; దా । దా ద మ । దా ద ని । సా సా
ని । త్య ని - । రా —— । మ య ।
, ప గ̇ । రీ సా । నీ నీ । సా సా ।
భృ - । త్యు ల । బ్రో వ । రా రా ।
, స స । పా పా । పా ప ద । పమ గరి ।
- స । త్య స్వ । రూ పా - । -గొ ను- ।
, గా మా । ప ద ప మ । గ మా గ । రి రి సా ॥
స ర్వే । శా —— —— । హా - ర । తి ది గో ॥

## పాట

శ్రీ రామా గొను కర్పూరా హారతిదిగో!
సీతాదేవికి ముత్యాలా హారతిదిగో! ॥

**చరణం (1)** నిత్య నిరామయ
భృత్యుల బ్రోవరార,
సత్య స్వరూపా గొను
సర్వేశా హార తిదిగో ॥

(2) బోధనందన గమన
ఆదిమధ్యాంత శూన్య
వాదభేద విహీనా
పరమాత్మా హారతిదిగో ॥

